# విశ్వస్వారాజ్యం

(క్రొత్తనాటకం)

రచయిత:

వేదాంతకవి అను

వేదాంతం వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1945



[ వెల రు [redacted]

## ప్ర క ట న

నా లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే, ఎవ్వరూ ఎక్కడా ఏవ్యాపారాలకీ, ఏప్రదర్శనాలకీ, సినిమాలకీ, ఫోన్‌రికార్డులకీ, రేడియోలకీ, ఈ విశ్వస్వరాజ్యం నాటకంలో కథగానీ, పద్యాలుగానీ, గేయాలుగానీ, వచనాలుగానీ, వాడుకోగూడదు. నా పర్మిషన్ లేకుండా, అతిక్రమించి యీ నాటకాన్ని ఎవరైనా ఎటువంటి వ్యాపారాలకి ఉపయోగించుకొన్ననూ నేను జరిపెడి క్రిమినల్ సివిల్ చర్యలకు బాధ్యు లగుదురు.

ఇట్లు
వే దాం త క వి
అను
వేదాంతం వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

ప్రథమ ముద్రణ — 1000 ప్రతులు.

శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల
రా జ మ ం డ్రి
1945

# నా మాట

ఈ "విశ్వస్వరాజ్యం" నాటకాన్ని నాచిన్నతనంలో వ్రాసింది. కొన్నాళ్లు రంగుపూసుకొని గజ్జెగట్టుకొని హంగుదార్లతో వూళ్లమీద పడ్డది.

పురాణనాటకాల్లో పద్యాల్ని బాగా వల్లించి జాడించి చదివే రోజులు నన్ను ముట్టడించి యిన్ని పద్యాల్ని విజృంభించే నాటకాన్ని వ్రాయించినై.

పద్యాలమీద మోజుపడి ప్రజలు మోరలెత్తుకొని కూర్చున్ననాడు, నటరాజులంతా వాళ్లకెక్కావల్సినన్ని పద్యాలు మోపులు కట్టుకొచ్చి పడేసే వాళ్లు. అయితే ఆపద్యాల్లో వున్న నిషా యేమిటోగాని, ప్రజలంతా వాస్తవ జగత్తును మఱచిపోయి స్వప్నజగత్తులో పడిపోయినారు.

పద్యాలూ రాగాలూ దిల్ని యెటువంటి అయోమయస్థితిలోకి తెచ్చిపెట్టినైరా బాబూ అనుకొని, తిరిగి, నేను గూడా యీ స్వప్నజగత్తులో పడివున్న ప్రజల్ని వాస్తవజగత్తులో పడేయటానికి యీ నాటకంలో యిన్ని పద్యాలు మోపులుకట్టి పడేయాల్సివచ్చింది.

నాటకంలో కథ అంతా నా స్వంతకల్పన. ప్రస్తుతంలో ఈనాటకాన్ని చదివి నాట్యకళారాధకులూ, రసికజనమనోభిరాములూ ప్రదర్శించసల్లయితే ప్రజలకి విశ్వస్వరాజ్యం ఎక్కడుందో చూపిస్తారు.

వేదాంతకవి.

# ఏ మి టో ?

దేశంలో రేగిన స్వాతంత్ర్య పిపాస కవితాప్రపంచంలో తగినంత సంచలనం కలిగించలేకపోయింది. దీనికి కారణం—కావ్యజగత్తు ప్రజా జీవితంతో సంబంధములేని స్వప్నజగత్తుగా తయారుకావడమే.

సాహితికి సంఘ జీవితానికి గల సన్నిహితత్వాన్ని పునరుద్ధరించి రెంటికి మెరుగులు దిద్దడానికి ప్రయత్నాలు జరుగుతున్నయి. ఆకాశమార్గాన ప్రవహిస్తున్న కవితాస్రవంతిని భూలోకానికి మరల్చి ప్రజాజీవిత సుక్షేత్రంలో బంగరుపంటను పండిస్తున్న తెలుగు రైతులలో వేదాంతకవిగారొకరు.

నేలవిడచి సాముచేయడం అలవాటులేకపోవడంచేత, వేదాంతకవిగారు జాతీయ చైతన్యపు తాకిడినుండి తప్పించుకోలేకపోయారు. బానిసబతుకులలో చితికి చీకాకైన జాతి దురవస్థను చూచి వ్యధితమై రెపరెప కొట్టుకున్న హృదయం వీరిది. ఈ హృదయంలో పొంగిపొరలిన ఆవేశంలో 'విశ్వ స్వరాజ్యము' అవతరించింది.

ధ్వని ప్రధానమైన ఈ రూపకం తెలుగు నాటకరచనలో ఒక స్వతంత్ర పంథాలో నడచింది. నాటి ప్రేక్షకుల అభిరుచి కనుగుణ్యంగా [illegible] మయింది. హృదయాన్ని ఉద్రిక్తంచేయగల పద్యాలు అమూల్యాలంకారాలు ఈ రూపకానికి. పాలకవర్గపు రాజనీతిని, జాతీయోద్యమంలో వివిధవర్గాల స్థానాన్ని పాత్రను, స్పష్టంగా 1935 నాటికే అవగాహన చేసుకొన్న నిశిత దృష్టి వేదాంతకవిగారిది.

కారుచీకటులపై కలియబడి పోరాడుతున్న కష్టజీవుల కండగా నిల్చిన ప్రజాకవి వేదాంతకవి. కవితాలోకానికి ఇదిగో వారి హెచ్చరిక.

"మీ అద్వితీయ ప్రతిభా సంపత్తులను ఈసమయంలో పుష్ప మకరందము నాస్వాదించు సోమరి తుమ్మెదలమీదనే వృధాచేయకుడు. ఈసమయము ఛట్రాజు కవిత్వమునకు సమయముకాదు. దేశ బానిసత్వమును పటాపంచలుగ చేయగల వ్రాతలే వ్రాతలు."

"జగంకోస మీయుగంమూసలో పసువులు అన్నీ కరగాలోయ్"

(కొత్తపాటల్లోది)

ఈ మహోత్తర లక్ష్యాన్ని రచయితలు మరువకుందురుగాక !

క॥ వెంకటరామశాస్త్రి.

# నాటకంలో ముఖ్యమైన పాత్రధారులు

భరతమాత—భారతీయులను కని పెంచుతున్న తల్లి, జనకుని ఇల్లాలు

జనకుఁడు—భారతీయులను కాపాడుతున్న తండ్రి

విద్యానిధి—భరతమాత పెద్దకుమారుడు, చదువుకొన్నవాఁడు

ధర్మరాజు—భరతమాత రెండవ కుమారుఁడు, జమీందారుడు

బలుఁడు—భరతమాత మూడవ కుమారుడు. షావుకారు

శూరుఁడు—భరతమాత నాల్గవ కుమారుఁడు. రైతు

రత్నం—భరతమాత కడగొట్టు బిడ్డఁడు, కూలివాఁడు

తిక్కశాస్త్రి—భరతమాత సంస్థాన కవీశ్వరుఁడు, చమత్కారి

దండధరుఁడు—భరతమాత సంస్థాన భటుఁడు, ధైర్యముగలవాఁడు

ప్రభంజనుఁడు—భరతమాత సంస్థాన భటుడు, శౌర్యముగలవాఁడు

భేతాళుఁడు—దరిద్రదేవత పెద్దకుమారుఁడు, దుష్టబుద్ధిగలవాఁడు

భైరవుఁడు—దరిద్రదేవత రెండవ కుమారుఁడు, నీచమైనవాఁడు

## స్త్రీలు

రాజ్యలక్ష్మి—భరతమాత కోడలు, భరతమాత కొడుకుల ధర్మపత్ని

దరిద్రదేవత—లంకనుంచి వచ్చిన తల్లి, మోహినిగా మారినది.

శ్రీ

# విశ్వస్వారాజ్యము

## ప్రథమాంకము

### 1 వ రంగం

[ఉన్నతమైన పర్వతప్రాకారాలమధ్య సర్వసుందరవిశాలకాంతారములతో నిలిచియున్న రాజధాని, స్వప్నపురి, ప్రభాతకాలము, మాతృస్తవముతో ప్రజలు ప్రవేశింతురు.]

ప్రార్థన

వేదమాతలతోఁ బెరిగిన తల్లి
రతనాలబొజ్జలతోఁ గాజుల్లు తల్లి
చెలువైన లోగిళ్ళసిరులున్న తల్లి
నిఖిలవిద్యలనెల్ల నేర్పిన తల్లి
చల్లనిసంకల్ప మల్లారు తల్లి
పండునోములునోచి పండిన తల్లి
సౌందర్యములనేలు చక్కని తల్లి
ముల్లోకములవాని మురిపించు తల్లి
బ్రహ్మాండకర్తకు రాణివై తల్లి
కడలికావలివాంధ్ర నెలకొల్పుతల్లి
ఎత్తైన గిరికోటలెత్తిన తల్లి
శృంగారవనములఁ జిగిరించు తల్లి

బంగారు నదులను బాలించి తల్లి
నవరత్నఖనులను నవరించి తల్లి
పలురకమ్ములపంట పండించి తల్లి
భువనైకశూరులఁ బోషించి తల్లి
పోతుగడ్డను పురుషపుణ్యాల తల్లి
వీరనారీమణులు ప్రీతిల్లు తల్లి
మమ్ముగంటివికాదె మముగన్న తల్లి
ఈచిరంజీవుల నేలవే తల్లి

(తెరపడును) (నిష్క్రమింతురు)

2వ రంగం

[మేడమేడలో నవరత్నఖచితహంసతూలికా తల్పముందు పరుండి వున్న భరతమాత లేచి జనకునితో]

భరత——శ్రవణానందంగా ఈవినవచ్చిన గేయాలు ఎవరు ఆలాపన చేశారోగాని, మృదుమధురభాషాగంభీరములై ముద్దులు మూటలు గట్టుచున్నవి. మీరు వింటిరా ?

జనక——విన్నాను.

గీ. కడుపుతీపిచే తల్లి పాల్గుడిపి నపుడు
పాల్గి కేరింతలనుగొట్టి ముద్దుగొలుపు
స్వర్ణడోలికలలోని పాపాయిలవలె
బిడ్డలందఱిమొఱ విసపడ్డదేమొ.

భరత——ఈగేయాలు మనతనయులు తీసినవేనా ?

లేక భ్రమతో

ఛాక. కనుక, ఓ దిక్కుమాలిన దరిద్రదేవతా! ఏ దిక్కువారు నిన్ను సమ్మతించి రానిస్తారో అక్కడికి తరలి పొమ్ము.

చ. సరళ గుణప్రసూన లత, చక్కని నోములపంట సెన్ ధను
ర్ధర రణరంగ సింహాలను ధర్మ కుమారులఁ గన్నతల్లి యీ
పరమ పతివ్రతామణి తపస్సు ఫలించు వరాల గడ్డపై
చరణము పెట్టి యుందు వటె? చావక ఓసి! దరిద్రదేవతా.

దరిద్ర—అయ్యా! ఆగ్రహించకండి. మీదయతో నేను కూడా ఈ దేశంలో చల్లగా బ్రతుకుతా.

జనక—నీవంటి దరిద్రమొహాలకి ఈదేశంలో తావులేదు. తర్లి పొమ్ము.

మ. సకలైశ్వర్య కళావిలాస గుణయోషారత్నమై బ్రాహ్మియై
శుకయోగీంద్రకవీంద్ర వాగ్రసధునీ శుద్ధాంత ముగ్ధాంగనా
సుకుమారత్వము నూపు భారతకథాశృంగార పద్మాలయా
సుకుమారత్వము మాపవచ్చితివటే? చుల్కంగ ఓ ఘాతకీ.

భరత—ఇంతసేపు ఈ పాపిష్ఠురాలితో వాగ్వాదమా? దీని కిట్లా చను విచ్చి మాట్లాడినట్లయితే మరల దీనిని వదల్చుట మనతరమా?

గీ. ఒరులగుమ్మంబు లేదని యొక్కనాఁడు
గూడ త్రొక్కి యెఱుఁగము నేఁడు దీని
వలన మనము త్రొక్కవలసి వచ్చెనేమొ
అకట! నాయిల్లు పొట్టఁ బెట్టుకొనునేమొ.

దీనికింకా శాంత వచనాలు పనికిరావు. ఇహా తగిన శాస్తిచేసి పంపించండి. దీని రోగం తగిలిన యింకా కుదుర్చుట యెవరి తరంగాదు. దీనిరోగానికి చిహ్నం సోమరితనం. ఏమిటి? పలకకుండావున్నారు? దీని మచ్చుమాయలకు లోఁబడలేదుకదా. ఓసి! దరిద్రదేవతా!

సీ. గుబురురత్నములున్న కోటగోడలపైన
చికిలింత మొలుపవచ్చితివ సవతి!
స్ఫటికసంపుటవజ్ర సౌధభాగములపై
జిల్లేడు పెంచనెంచితివ కులటా?
చెలువైన రవ్వల సింహాసనముమీఁద
త్రాచుపాముల నిల్పఁదలఁచితివటె?
కోమలైన నవసింధికావ్యములన్ని బూదిగా
చెదలపాలను బెట్ట చేరితివటె?

గీ. విశ్వజనసోదరత్వము విశదపఱచి
పెంచఁబడు నాదుబిడ్డల మంచియైక
మత్యమును గంగలోఁగల్పి మహిమచెఱిచి
భరతమాతకమచ్చ కాల్పఁ బాల్పడితివె?

జనక—అసమాన్యశౌర్యగుణధుర్యులైన ఔదార్యహృదయ గంభీరవిలక్షణా లక్షితవిశాల విచక్షణాదృష్టిగల భారతీయులే మనకు పుట్టిన వారైనట్లైతే దీనియాటలిక సాగనివ్వరు.

దరిద్ర—పిడికెడు బిచ్చం పెట్టడానికి శక్తిలేనప్పుడు పెట్టువాకిలినైనా బుద్ధిమంతులు చూపింతురు. అదిలేకపోగా నాయాటలుగూడా సాగనివ్వమని చివ్వుకాలుద్రువ్వెదరుగా? అయిననూ ఏమాత్రం నాతో డీకొని జయింతురో చూస్తా! (మిర్రిచూచు)

భరత—(భయంతో) చూచితిరా! దానికసి. కంటితో పసిపట్టుచున్నది.

జనకు—చూడనీ. మనపిల్లలసంగతి తెలుసుకొనుటానికే చూస్తున్నది. భయపడక. అదిగో! మనబిడ్డలు వస్తున్నారు.

[విద్యానిధి, ధర్మరాజు ప్రవేశింతురు]

దరిద్రదేవత నక్కి నక్కి దాగుకొని చూచును.

భరత—స్వాతంత్ర్యులారా! రండి.

విద్యా—తల్లీ! ఈకురూపి యెవతె?

భరత—నాయనా! విద్యానిధి!

ఉ. సుంతయుఁ గష్టముఁ గని బడనిసోమరిపోతులతోడఁ బుట్టు, ర
వ్వంత దయారసమ్ము కనుపట్టని వజ్రశిలామనస్సు, దు
ర్దాంత దురూహ మోహవిషదంత దిగంతవభాయమాన ని
ర్ఘాంత దరిద్రదేవతర; రాజ్యములో మునుపెప్డు లేదురా.

పైగా పైబడి బెదరిస్తున్నది.

విద్యా—(ఆశ్చర్యముతో) దరిద్రదేవతా; ఈమె దేవతయున్న నిదేమో?

ఉ. ముప్పదియారుకోట్ల జనముల్ బరిపాలనచేయు కోటలో
నెప్పుడు కాలుపెట్టితివి యేమతిహీనుఁడు నీకిదూరుఁడై
యిప్పరి నర్ఘ్యమిచ్చె? నిలువిమా! కనుమిమా బలియిచ్చుకొందు, ని
న్నిప్పుడు భారతావనికి; ఏమపుగొట్టు దరిద్రదేవతా.

నిన్ను చూచి జాలిపడ్డ ముసలివాళ్ళని బెదరిస్తున్నావా!

ఉ. నీబెదరింపు నాదు జననీజనకుల్ కని భీతిఁజెందు న
ట్లీబెదరింపు మమ్ము కదలింపవు వంపవు, నిన్నుమాత్రమే
యూబిలో పాతిపెట్టెదమొ యూహ యొనర్పవు; నీశరణ్యుఁడే
జేబులోయుండెనో కనుము సిగ్గుయులేని దరిద్రదేవతా.

ధర్మ—అన్నా! ఈవికృతాకారమేమిటి? చతుస్సముద్రవేలావలయితం బయిన వసుంధరాచక్రము నేలుభారతీయులను బెదరించు టేమిటి?

చ. దుర్మద వృత్తి నొంటరులు దూకుడుగాఁ బయిఁ దూకబోవు త
ద్దుర్మతు లింపు లేరు, తల ద్రుంచనె యుండిన? దక్కనిత్తు నా
కర్మము నూచి కాల్నిలుప గ్గెల్చుటకున్ దిలకింపవత్తు వా
చర్మము వల్చివైతును పిశాచపురూపు దరిద్రదేవతా.

[బలుడు ప్రవేశించును]

బలు—అన్నలారా! ఏ మది? ఎన్నఁడూ క్రోధావేశం ఎఱుగని మీ వర్చస్సు లిట్లా వుంటానికి కారణం ఏమిటి? తలిదండ్రులారా! మీరు కూడా చిన్నబోయి మిన్నకున్నారేమి? (ఆశ్చర్యముతో దరిద్రదేవతవంక చూచి) ఓసీ! రక్కసీ! నీ వెక్కడిదానవే? (దరిద్రదేవత పారిపోవుటకు చూచును) నిలు నిలు నీచురాల? ఏ లింగభయములు అభినయింతు వేమి? నిన్ను నేలకి రాయనిదే వదలిపెట్టను.

జనను—కుమారా! బలా! ఇది దరిద్రదేవత.

బలు—ఓసీ! గృహచ్ఛిద్రహేతుభూతకే! దరిద్రదేవతా పాతకీ! నిలు నిలు.

శా. నీవా తొల్లి కుచేలు నింటఁ గొలువై నిష్ఠన్ వినాశమ్ముపై
ఆవేశమ్మునగఁ బాంపవించితివి; దైత్యారాతి నీ గ్రుద్దు నాఁ
డే వేళన్ బాడిపించనో తిరిగి నేఁడే నీవు దేశమ్ములో
జీవింపన్ జనుదెంచినావటు? యిసీ! చండాలదేవన్ రక్కసీ!

[శూరుఁడు ప్రవేశం]

శూరు—సోదరా! ఎవరిపై మీ క్రోధావేశం? మన జననీజనకులపై కి ఎవరైనా దండెత్తి వచ్చినారా? (దరిద్రదేవతను చూచి) రోత గొట్టు మొహంతోవున్న ఈమె ఎవతె?

బలు——ఇది దరిద్రదేవత. దీనిమూలంగానే కొంపలో ఇంతక్రోధ సంక్షోభాలకి కారణం.

శూరు——ఈ దరిద్రదేవతని రానిచ్చి యింతసేపెందుకు వూరుకున్నారు ?

ఉ. ఓసి ! దరిద్రదేవత ! మహోగ్రరణావనిశూరులందున
గ్రేసరులై మదేభరిపుకేసరులై రసికావతంసులై
భాసిలుచున్న యీనిఖిలభారతయోధులమధ్యనిల్చి పే
ర్వాసి గడింపనీతరమె ? చాతుము ద్రోతుము పాడునూతిలోన్.

దరిద్ర——అయ్యలారా ! మీవంటి దక్షులకు సామ్రాజ్యము భారమైనదైతే, పోనీ అనసూయమ్మ చంటివాళ్ళ పాలుపడిపోయిందిష.

భరత——ఓసీ ! నాపసికూనలపాలిట, నాకూలిరత్నంపాలిట బ్రహ్మరాక్షసివై పడెదవటే ? ఛీపో !

గీ. ఆజగజ్జనకుఁడే అవనినేను
నోచుకొన్న నోములకు సంతోషపడక
పిరికివారి నాకిచ్చుచో వెఱవకేవు
చంటిపాపలజోలికి చనఁగగలవె ?

విద్యా——తల్లీ ! భరతసామ్రాజ్య కల్పవల్లీ !

మ. క్షితిపై జాతికి జీవనిచ్చు కరుణాక్షీరాంబుధిన్ బుట్టి నీ
రతనాల్ గర్భము నత్తగవ్వలను ప్రారబ్ధంబు చేఁగన్న నీన్
వెతలన్ దుర్గతులన్ దురంతవధలన్ వేధించు దారిద్ర్యదే
వతకున్ నీపసికూనలన్ బలికి నొప్పంజెప్పి మేముండుమే.

[రత్నం ప్రవేశం]

రత్నం——అన్నా ! సకలవిద్యాప్రవీణా ! ఏల ఈ పూర్వ నిర్వక్రమాలంకార ధౌరేయులగు సహోదరులూ యీ వీరసింహకిశోరముల గన్నతలిదండ్రులూ నీవూ కోపోద్దీపిత మానసులై యున్నారు ?

(చూచి) ఈమె యెవ తె ? పాపం కళాకాంతులు తప్పి తెల్ల బోయియున్నది ?

దరిద్ర—నాయనా ! కూలిపోరా ! ఈ దరిద్ర దేవతకింకా నీవే దిక్కు.

(అని దగ్గరకు పోబోవును)

భరత—(అడ్డుపోయి) ఆ, ఆ కిరాతకురాలా ! నిలు నిలు.

జనకు—(లేచి) నను స్వసర్వస్వ ధ్వంసకీ ! ఆగుము.

విద్యా—(కోపముతో) పాపభీతిలేని పాతకీ ! ఇటుచూడు మూడినదే

ధర్మ—(ఉగ్రుడై) ఓసీ ! ప్రళయకాలభయంకర స్వరూపిణీ ! ఇదిగో ! ఖడ్గదేవత. బలిగోరి తీరుతుంది. జాగ్రత్త.

బలుడు—(పండ్లు కొరికి) ప్రేతభూతపిశాచ సంపర్క సంజాతకీ ఘాతకీ ! ఒడలితాట నొలిచివేస్తా.

శూరు—(పెద్దగా) ఓసీ ! దరిద్రదేవతా ! దుష్టురాల ! దుష్కర్మురాల !

(అచ్చటికి వచ్చుచున్న తిక్క-శాస్త్రి ఆ కేకతో పులిక్కిపడి ఆత్తరపాటున చూడకుండా వచ్చి దరిద్రదేవతదగ్గఱ కూర్చొనబోయి పరాకున దానిని చూచి "అమ్మో" అని లాఘు కేక పెట్టుచూ తూలి పడును)

భరత—నాబిడ్డలారా ! ఆబిడ్డడెవరో చూడండి పాపం.

విద్యా—(దగ్గఱకు వచ్చి) అయ్యా ! భయములేదు.

తిక్క-శాస్త్రి—(తలిక్కిపడి) భయపెట్టకుండా చంపుతావా ?

ధర్మ—(దగ్గఱకొచ్చి) కాదు కాదు. మేమాపిశాచాలంగాము.

తిక్క—(ఏడుపుతో) మఱిమీరేంపిశాచాలు ?

బలుడు—(నవ్వుతూ) అదికాదయ్యా !

తిక్క—ఓసి నీదుంపతెగ. నీకెన్నిగొంతులున్నవే ? ఆ చంపు.

శూరు—(బిగ్గఱగా) చాద స్తమా విలుస్తుంటే.

తిక్క——(ఉలిక్కిపడి) అమ్మబాబోయ్, చంపటానికి పిలిస్తే యెవరు వస్తారు ? ఇప్పుడు నాచాదస్తమే ప్రశస్తం.

రత్నం——మేము చంపేవారంకాదండి. చంపేది దరిద్రదేవత.

తిక్క——ఊ...ఏమిటే, మీరెవరూ ? ... గ్రింగేనావా ? ఓసి నీదగ్గి రెన్నిటక్కుటమారవిద్య లున్నవే ? నిముషంలో ఎన్ని స్వాంతులు మారుస్తావ్.

భరత——బిడ్డలారా ! ముందాదరిద్రదేవతను తరుమండి. తర్వాత వీరిక స్పృహవచ్చినప్పుడు మాట్లాడవచ్చు.

తిక్క——ఓసి నీయెత్తు లెవరికి తెలియవు లెద్దూ.

విద్యా——ఓసీ ! పాపిష్టురాల ! ఇంకా ఒక్కక్షణమిచ్చుట నీవు నిల్వటానికి ఆస్కారంలేదు పద. తమ్ములారా ! దీనిమత్సర ముడిగించి గెంటివేతమురండి.

దరిద్ర——(నవ్వి) ఏమిటి ! నన్ను గెంటటానికి మీకు గుండెలున్నవిగా ? (అందఱూ చుట్టుముట్టడించి గెంటబోదురు. దరిద్రదేవత వికటాట్టహాసంతో భీకరాకారముతో విభ్రమము గొల్పుచూ అగ్నిధూమారాల్ని గ్రక్కుచూ, నానాజీవకోట్లనీ లేపి పరుగెత్తింపుచూ)

సీ. పసిడికొండపయిని ఘోలాత్ముని గృహమ్ముఁ
గాటిలోఁ జేర్చుటఁ గాంచఁబడదె ?
వైకుంఠవాసుని ద్వారకానగరి, నా
నడిసముద్రమున గూల్చఁబడుటవినరె ?
అందఱదృష్టంబు లటుచేతఁ గలబమ్మ
పొలతికి చిప్పఁజూపుటలు కనరె ?
శ్లాఘనీయులయిన రాజాధిరాజుల
ఘోరాటవికిఁసీడ్చు గుర్తులేదె ?

గీ. నా ప్రతాపాగ్ని పర్వతాననము చిట్లి
భగ్నమనునప్పు డెవ్వఁడు నెగ్గగలిగ ?
మీరలా ! నన్ను బంధించువారలౌర !
దేశమును ధ్వంసనముసుజేసి తిందుమిమ్ము.

(ప్రతిజ్ఞ చేసి నిష్క్రమించును)

(అందఱూ విభ్రాంతిపడి చూచుచుందురు)

రత్నం—(లేచి) ఇంతమాత్రానికె వెఱవగూడదు.

మ. తరమే ? బ్రహ్మకు వానియబ్బకు సమస్తంబైన శస్త్రాస్త్రని
ర్ఘరణీనాధులకైన మమ్ముగెలువన్ ? రానిమ్ము కానిమ్ము దు
స్తరదారిద్ర్యపిశాచినిన్ బయికి; నాతల్లీ చిరంజీవులై
పరగన్ మాకిదు నీదుదీవెనలవే వ్యర్థంబులేగాని-చోన్.

జనకు—నాయనా ! కూలిరత్నమా ! నీవు చెప్పినవన్నియు యథార్థములే. కానీ సాధింతుసని ప్రచండప్రతిజ్ఞచేసి పోయిన ఆదరిద్ర దేవత యేరూపంతో రాజ్యముమీద పడనున్నదో జాగ్రత్తగా కనిపెట్టుచూ రాజ్యలక్ష్మి అభిమానాన్ని గాపాడుటకై తగు ప్రయత్నాలకు పోయిరండి.

[కుమార్లంతా లేచి]

కుమార్లు—జననీజనకులారా ! నమస్కారములు.

(వీర గేయాలు పాడుకొంటూ నిష్క్రమింతురు)

జనకు-భరత—(లేచి) చిరంజీవులారా ! సుఖముగా పోయిరండు.

భరత—పాపం ఇతఁ డెవ్వరో ఏని సంగతి విచారింతమా ?

జనకు—(నవ్వి) భయంతో స్పృహతప్పి పడ్డాడు. వట్టి అలిపిరికివాడు. మనలను చూచి కూడా జడుసుకొంటున్నాడు పోదాం పద. లేచు నేమొ. (భరతమాత-జనకుడు నిష్క్రమింతురు)

తిక్క——(ఆవులింతలతో ఒడలు విఱుచుకొనుచూ) అబ్బా ఏమిటీ గొడవ? ఇ వెక్కడ పిశాచాలురాబాబు చంపుకు తింటున్నై. (లేచి నలువైపులా చూస్తూ) ఇప్పటికి గండం తప్పిందిబాబు, ఇంకా యోగం యెప్పుడు పడుతుందోగాని, బ్రతికి బయట పడ్డాను. (ఉలిక్కిపడి నలువైపులా చూస్తూ) సర్వసంపదలకు, ఆలవాలమై ప్రసిద్ధికెక్కిన యీ భారతభూమి భూతప్రేతపిశాచాది గణాలకి గూడా ఆటపట్టని నేడు బాగా బోధపడ్డది. గతించిన భారతయుద్ధంలో మరణించిన కౌరవవీరు లేమైనారు మరి? మన కిప్పుడు స్థానవదలకుండావున్న పిశాచాలుగా మారారు. చింత చచ్చినా పులుపు చావనట్లు వీ ళ్లెంత చచ్చినా కొలుపు మానరు. కౌరవమేళం వదలిందనుకొంటే, మళ్లీ గౌరవ మేళం వచ్చిపడిందెట్లా (తొంగి తొంగి చూస్తూ) వీటి కంటపడకుండా వీటి మచ్చుమాపే పన్నాగం పన్నాలి.

(నిష్క్రమించు తెరపడు)



# విశ్వస్వరాజ్యము

ద్వితీయాంకము

1 వ రంగం

[మనోహర వనసీమ, సరసీరుహాలతో విరాజిల్లుచున్న సరోవరము, అచ్చటికి విద్యానిధి అశ్వారూఢుడై వస్తాడు, చక్కని పూలతీగెలదగ్గఱ దిగి, పూలను కోస్తూ]

విద్యా—

మ. చలిదై చల్లని పిల్లతెమ్మెరలతోఁ జెల్గాట చెన్నారగా
గల యీనూత్నగుణప్రసూన లతికాకాంతాలలామంబు కో
మల సౌరభ్యము గుప్పితప్ప పగిదిన్ మద్రాష్ట్రభృత్వర్గాని కె
ల్ల లతాతన్విగ రాజ్యలక్ష్మి యిఁక నుల్లాసంబు గల్గించుతన్.

సర్వసంపత్కరమైన యీవిశాల భారతవర్షాన చెలువైన నవరత్నహర్మ్యాలలో రాజ్యలక్ష్మి పండువంటి కాపురం రాణించటానికి,

సీ. సరసగుణామృత సాహితీసరసులై
విద్యానిధులు ధర్మవిధినినుండి
సుకమున కనులు పూడక తోటమాలులై
ధర్మరాజులును దోహదంబు లిచ్చి
గలలువేసిన నారికేళవృక్షంబులై
బలిసి కుబేరులు కొలువుదీర్చి

సకల పుష్పఫలభూజవిశాల శాఖలై
శూరులు రసములు ధారఁబోసి

గీ. రత్నవేదికపై లేఁతప్రభలనతికి
నీదు కడగొట్టు తమ్ములాహ్లాదసఱచి
పరిఢవిల్లఁజేయుచును నీవనముపగిది
యుద్ధరింపవలయుఁగాదె యుద్ధరిత్రి.

రాజ్యలక్ష్మికాఁబోలు వస్తున్నది. ఈమెకు కావలసిన వారిలో నేనొకనిగదా, నేను కనపడనట్లైతే పిలుస్తుందో, లేక ముఖారవిందం వికసిస్తుందో చూస్తా. (పూపొదలలో దాగుకొనును)

[కీర్తన పాడుతూ రాజ్యలక్ష్మి ప్రవేశం]

కీర్తన.

నామనోహారుల సిరులలోనే
నా వినోదములు కళలు చూపుగదే
సుకుమారీ! వనగారీ
సురుచిర సుందరనారీ ॥నా॥

అమ్మ దొంగా నేను చూడలేదనా దాక్కొన్నావు.

మ. అవినాభావముగా వినోద సుమనోద్యానమ్మునన్ బుట్టి పె
ర్గి విలాసమ్ముగ పూలమొక్కలకు గోర్కెల్ తీర్చి సౌందర్య ప
ద్య విధానమ్ముగ గద్యచందముగ విద్వల్లోక కళ్యాణ గ్రం
థ విశేషంబున దాగు వారలముగాదా నీవు నే నెప్పుడున్.

రాజ్యభార నిర్వహణశక్తి యుడిగి, వైరాగ్యవృత్తికి తయారు కావటమా యీ దాగుడు మూతలాడటం? అసమాన మేధాసంపన్నులైన మీవంటి విద్యానిధుల పాదసాన్నిధ్యాన సుఖకాపురం చేస్తున్న

యీ రాజ్యలక్ష్మిని గూడా విరాగిని చేసి దాక్కోండి. అట్లా చేయ టానికి మీ కిష్టం లేనట్లైతే యీ రాజ్యలక్ష్మిని అర్థరాత్రివేళ యే గంగ లోనైనా పడద్రోసి పొండి. ఎంత ఘోరకార్య ఘటనాచక్రమైనా త్రిప్పటానికి మీకు మీరు సమర్థులు. స్వతంత్రులు.

గీ. కొలికిపూసవునాయనువులకునీవు
నీవుజారినతక్కిన జీవులెల్ల
రాలిపోవు సమ్మెటబూందికాలిపోవు
రాజ్యలక్ష్మిక విద్యాపరాక్రమనిధి.

విద్యా—(చాటుగావచ్చి గొంతుమార్చి) ఎవతెవీవు ?

రాజ్య—(ఉలిక్కిపడి) అమ్మో (చూచి) ఏమిటి ?

విద్యా—(నవ్వుచూ)

పట్టుతివాసిపై మురియు భారతమాతసువర్ణగేహము
మెట్టినముద్దుకోడల ! సమీరకిశోరపిహారసీను కొ
న్నెట్టిన బూచివానిగని భీతిలుదానవు, ముందుముందునీ
వెట్టులబూచివాండ్రఁ బిలుపింతువొకో భయపెట్టబిడ్డలన్.

రాజ్య—అందుకోసమా దాక్కొని భయపెడుతున్నారు ? (ఎదుట చూచి) ఆవచ్చేదెవరు ?

విద్యా—ఎవరోగాని యితఁడు చాలా భయస్థుడల్లేవున్నాడు. ఏవికార స్వరూపాన్ని చూచినాసరే, అది తన్ను చంపుకోనితినే పిశాచ మేమోనని భయపడతాడు. స్పృహతప్పి పడిపోతాడు.

రాజ్య—(నవ్వి) అక్కడకు పోతున్నాడు !

విద్యా—ఊరసికంటికి ఎవరు కనిపించినా పిశాచాలుగా, భాసిస్తాడేమో గ్రహాచారం. (బిగ్గరుగా పలుచు) ఎవరండోయ్ మీరు !

రాజ్య—(నవ్వి) అట్లా ఉలిక్కిపడ్డాడేమిటి ?

విద్యా—నేనిప్పుడు చెప్పిందేమిటి? ఇట్లారండిబాబు!

[తిక్క—శాస్త్రి ప్రవేశం]

తిక్క—(దూరముగా నిలబడి వెఱపుచూపులతో చూస్తుండును)

విద్యా—భయంలేదు లేదండి.

తిక్క—భయమో గియమో నాకేమీ తెలియదు. ముందు మీ రెవరో కొంచెం చెవిని వేయండయ్యా?

విద్యా—అప్పుడే మఱచిపోయారండీ! మొన్న మాదగ్గఱను గాలా మీరు.

తిక్క—ఓసి నీదుంపతెగ. ఈవేషంతో మళ్లీ యెదురైనావటే?

(పరుగెత్తును)

రాజ్య—(నవ్వుచూ) అయ్యో! ఇంత వెఱ్ఱివాఁడేమిటే?

విద్యా—నేనింతకు ముందే చెప్పిందేమిటి! ఉండు. పట్టుకొస్తా.

(తిక్క—శాస్త్రి వెంట పరుగెత్తును)

రాజ్య—ఇటువంటివాఁడింకా దేనికి పనికొస్తాడు? ఎట్లా జీవిస్తాడు? (ముందు చూచి) అయ్యో అయ్యో! అట్లా పరుగెత్తుతాడేమిటి? వీరినిగూడా పిశాచంగా భావించాడేమొ ఖర్మం. అయ్యో వీడి పిచ్చి బండలపడ (నవ్వి) అబ్బా పడ్డాడు. పట్టుబడ్డాడు. అయ్యో అయ్యో అట్లా పెనగులాడతాడేం? ఇంతవరకి వాడిదివఱకుదాఁకా కాలమెట్లా గడిపాడో. వారు చెప్పింది నిజమే.

[మెచ్చుమటలతో విద్యానిధి, తిక్క—శాస్త్రి ప్రవేశింతురు]

తిక్క—(వడఁకుతో) దీనికేనా నన్ను బలియిచ్చేది?

విద్యా—దేనికీలేదు గాని కూర్చోండి.

రాజ్య—(నవ్వుచూ) అయ్యో! వ్రాత.

తిక్క—(వెఱ్ఱిచూపుతో) మీపొట్టబెట్టుకోటానికి సాక్షి సంతకాలతో వ్రాతగూడానా ?

విద్యా—మాట్లాడకుండా కూర్చోండి కాసేపు.

తిక్క—కూర్చుంటే ఏంచేస్తారు? ఇద్దఱూ కలసి తలపగులగొట్టి తింటారా?

రాజ్య—(నవ్వును)

విద్యా—నవ్వక.

మ. ఇతఁడేమో కవితామనోహరికిఁ బ్రాణేశుండు గాఁడో చు బల్
ప్రతిభావంతుడు కాకపోయిన మహావర్చస్సు కన్పట్టునే
శ్రుతులన్ నేత్రములన్ విశాలమహిమన్ శోభిల్లుచున్ ? గాని ఈ
మృతిలేనట్టి కవీంద్రులి ట్లగుటి యేమీ! రాజ్యలక్ష్మీమణీ!

ఎందుకయ్యా భయం ?

అడలకుమయ్య ! భీకరబకాసుర ముఖ్యబలాఢ్యకోటి తుం
నుడుమనను, పొంగులెత్తు ఘనదోస్స్థల నుగ్భరమైన యుద్ధ్కనిన్
దడయక బల్మికొద్ది తలఁదన్నిన భూపతులన్న గూడ, యీ
పుడమిని లెక్కసేయరు కవుల్; భయమందకుమయ్య సత్కవీ.

అయితే మీరేమి స్వామీ ?

తిక్క—చెప్పాల్సిందేనా ? తిక్కశాస్త్రి అంటారు. అయితే మీపేరు?

విద్యా—పేరుకు తగ్గవారేనండి. నాపేరు విద్యానిధి.

తిక్క—(సంతోషంతో) ఏమిటీ ! మీరేనా విద్యానిధులు. నిఖిల సద్గుణనిధీ ! కవులపాలిటిపెన్నిధీ ! విద్యానిధీ ! కొంచెం నా మనవి వినండి.

సీ. కంతలువడి చూరుకట్లూడి, నిట్టాడి
కూలుచుండిన కూలిగుడిసెలోన
ముడిగోష్టచేపాటు కడుపు దప్పి పొలమ్ము
గోరగ సాగిన రైతు కొంపలోన

దొంగదోపిడి చిల్లరంగడిలోఁ బడి
　　　　ఏడుచు కోమటి యింటిలోన
పిల్లలకోడియై పెండ్లాము కాళియై
　　　　జడిపించు బ్రాహ్మణ గడపలోన

గీ. నెపుడు కానరానట్టి విహీన దృష్టి
సర్పి దంష్ట్రి దారిద్ర్య పిశాచి; పూజ్య
రాజ్య లక్ష్మి తరించు మీ రాజభవన
సరణి, దిరుగుట చూచియే జడుసుకొంటి.

అంతేగాని ప్రళయకాల భైరవుని త్రిలోచనాగ్ని జ్వాలలు చుట్టు ముట్టుకొన్ననూ నేను భయపడువాడనుగాను.

రాజ్య—(కన్నీరు తుడుచుకొనుచుండును)

విద్యా—ఏమి టది రాజ్యలక్ష్మి! కంట తడిపెట్టుచున్నావు?

రాజ్య—ఇంకా దేని కంటారేమిటి?

చ. దయగలవారలై వివిధ ధర్మపథమ్ముల నన్ను నేలుమీ
అయిదుగు రన్నదమ్ము లిడు నానతికే పవదాటి నేరని
తయు, విధికేమి నాకడను దప్పక[illegible]! [illegible], దయా
మయుఁడ! దరిద్రదేవతకు మత్సరమెందుకు రాజ్యలక్ష్మిపై.

విద్యా—ఈ మాత్రానికేనా భయం పెచ్చుదానా! భయం లేదులే.

మ. లలనారత్నమ! వేదశాస్త్రకవితాలక్ష్మీకటాక్షంబునన్
గల, నాబుద్ధిపటుత్వమంతయును ఈ, నాదీక్షనీరాచగో
త్రులకుంభస్థలిపైన నంకుశముగా గూటించుచున్నాడ్ను భూ
స్థలిఁగాల్పెట్ట దరిద్రదేవతకు సాధ్యంబౌన ధైర్యంబునన్.

దుఃఖించక, అయితే తిక్క—శాస్త్రిగారు!

తిక్క—నాయనా! నాకూ భయం వదలినట్టేలే.

విద్యా——మీరు మాభరతసామ్రాజ్యసంస్థానకవులుగా వుండండి.

తిక్క——ఎన్నాళ్లు కవులు ?

విద్యా——ఎల్లకాలం.

తిక్క——ఓహో ఇది అన్నిటికంటే బాగుందే. వర్షాకాలం, శీతాకాలం, ఎండాకాలం, వచ్చేదెప్పుడో తెలుసుగాని యెల్లకాలం ఎప్పుడు వస్తుందో తెలియటంలేదే !

రాజ్య——(నవ్వి) గొప్పగా చెప్పుకోదగ్గ కవులేనండి మీరు !

తిక్క——(మొహం చిట్లించి) కవులూ కవులెక్కడ ? నాలో కవులా ! నీలో కవులా ? మాలావు అందకత్తె వెల్లాగి తేయేం.

విద్యా——(నవ్వి) మీరిప్పు డెచ్చటికిఁ బోతారు ?

తిక్క——ఓహో ! మీరింగేమిటి ? ఎక్కడికైనా మీరి పోయేదేమిటి? ఎవరిమాట మీరారు ? మితిమీరి యేం మాట్లాడారు ? మీరిప్పు డెచ్చటికి పోతానని అడిగేదాన్ని నెనకేసుకొని డబా యిస్తున్నావే !

విద్యా——అయ్యా ! తిక్క-శాస్త్రిగారు ! మీరు గేస్పుదయం దయ వుంచి కోటలోకి దయచేయండి. (రాజ్యలక్ష్మితో) వారు మహాకవులు పిచ్చివారని భావిస్తున్నావేమో.

రాజ్య——ప్రొద్దుపోయింది పోదాం సదండి.

విద్యా——అయ్యా ! నిరంకుశకవి చక్రవర్తి ! నమస్కారాలు సెల విప్పండి. (నమస్కరింతురు)

తిక్క——చిరంజీవ సుఖీభవ. సుఖంగా వెళ్ళిరండి.

(రాజ్యలక్ష్మి విద్యానిధి అశ్వారూఢులై నిష్క్రమింతురు)

తిక్క——ఈవిద్యానిధి అఖండమేధానిధి. ఈ రాజ్యలక్ష్మిమణి పరమపతి వ్రతాశిరోమణి. వీళ్ళిద్దఱి అన్యోన్యం అమూల్యం. వీళ్ళిద్దఱి దాంపత్యధర్మం నావంటి కవిజీవులకు శరణ్యం. ఈదంపతుల

అనుగ్రహాభాగ్యంతో బలంగలవాడనై ఇదివఱకు నన్ను ఏడల గొట్టిన యీపిశాచ గుంపుల్ని రూపుమాపేస్తా. ఈదురాశాపిశాచాలు ఎన్నెన్ని కొంపల్ని గుండాలేసి దిబ్బలు పడుతున్నయ్యో చూడండి. అన్నానికి వాచిపోయిన పొట్టలు ఏడ్పేస్తూ మూలుక్కుతున్నై. మొక్కేయండి. గొప్పక్రొవ్వితేగాని నిహాయిపకాశానికి పనికిరాదు.

(నిష్క్రమించు తెరపడును)

## 2వ రంగం

[దర్బారు సౌధసింహద్వారం ఇరువంకల ఆయుధపాణులై పారావాళ్లుంటారు. గుఱ్ఱపుసార్లులవారు, ఏనుగులంబారీలవారు, అశ్వారూఢులవారు, వస్తుంటారు. దండధరుడు, ప్రభంజనుడు జయజయశబ్దములఁ జెప్పుచుందురు.]

దండ—జయజయ జనకనిర్వేశేషా! జనకరాజమనీషా జయ్‌జయ్.

ప్రభం—జయజయ భారతమాతా! సద్గుణమణి భాగ్యేపేతా! జయ్‌జయ్.

దండ—ప్రభంజనా! ఇంకా మనప్రభువరేణ్యులు దర్బారునకు దయచేయలే దేమికారణమో?

ప్రభం—అదే తెలియటంలేదు. సమస్తదేశసామంతులూ విద్యాచాతుర్యనిధులైన అమాత్యవర్యులూ వచ్చి చాలాసేపైంది. ఇదివఱకెన్నడూ ఇంత ఆలస్యము చేయలేదు.

దండ—అమాంతంగా ప్రళయాలేమన్నా రాజ్యంలో పడ్డవా?

ప్రభం—ఆ; ఏమన్నావు? మనవంటి త్రిలోకైకవీరులైన బంటులూ సైనికులూ పహరాకాస్తున్న రాజ్యంలో ప్రళయాలు అడుగు

పెట్టడమేనా ? రాజద్రోహులెవరైనా వుంటే, మాతృద్రోహులెవరైనా వుంటే అడుగు పెడతయ్యేమోగాని లేకపోతే ఎటువాటికీ గుండెల్లేవు.

దండ—ఇదిగో నాచేతిలో ఈ గదాదండం వున్నప్పుడుగూడా అడుగు పెట్టలేవు.

ప్రభం—ఇదిగో! నాచేతిలో ఈగాండీవం ఉన్నంతవఱకూ ఇహా తప్పించుకొంటానికి ఎవ్వడికీగుండె లుండవ్ ప్రభువగేణ్యులు వస్తున్నారా!

దండ—(బిగ్గఱగా) జయజయ జనకనిర్విశేషా ! జనకరాజమనీషా ! జయ్‌జయ్

ప్రభం—జయజయ భారతమాతా ! సద్గుణమణిభాగ్యోపేత! జయ్ జయ్

[భరతమాత జనకుడు వచ్చి దర్బారులోకి పోదురు.
భటులు నమస్కరించుచుందురు]

దండ—అమూల్యమేధానిధీ ! అసమానవిద్యానిధీ ! జై జై (విద్యానిధి వచ్చి వెళ్ళును)

ప్రభం—జయజయధారుణీకల్పభూజ! ధర్మపరిపాలన ధర్మరాజ! జై జై (ధర్మరాజు వచ్చివెళ్ళును)

దండ—జయజయ అతులితధనదోర్బలా ! వితరణగుణబాహుబలా ! జై జై (బలుడు వచ్చివెళ్ళును)

ప్రభం—జయజయమహాహాలాయుధధరా! అఖిలరణావనిశూరా! జై జై (శూరుడు వచ్చివెళ్ళును)

దండ—జయజయ అఖండకార్యఘటనాధురీణా ! అనుపమానశ్రమజీవరత్నా జై జై (రత్నం వచ్చివెళ్ళును)

[తిక్క—శాస్త్రి ప్రవేశం]

తిక్క—అనగేం ? అరచిఅరచి నీగొంతుక లటికిపోయినయ్యా ?

దండ—(పట్టుకొని) నీవెవడవు ?

తిక్క—(ఇద్దరినీ వంకా చూచి భయపడి చతికిలపడును)

దండధరుడు ప్రభంజను పెడరెక్కలు పట్టుకొని లేవగీసి నిలబెట్టుదురు

తిక్క—ఇటువంటి దుర్బలుణ్ణి అడ్డగించటానికి ఈ రెండు మత్తవేదండాలు ఇంత కష్టపడుతుంటే, ఇంకా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన గామావంటిపైల్మానుల్కి—యిటువంటి మత్తేభాలు ఎన్ని కావల్సి వస్తయ్యో.

దండ—అధిక ప్రసంగం చేయక. నీ వెవడవో చెప్పి కదలు.

తిక్క—అధిక ప్రసంగం కాదయ్యా ! మీ కిది అవసర ప్రసంగమే నేను గూడా దర్బారులోనికి వెళ్లదలచి వచ్చా.

దండ—నీతో మా కవసరం ఏ ముంది ? మహారాజా దర్బారులో నీకేం అవసరముంది ?

ప్రభం—అసలు నీ పేరేమిటి ? నీ వెవడివి ?

తిక్క—చెబుతా. నేనేనా ? నేనే......

దండ—(కొట్టబోయి) ఏమటది ?

తిక్క—మాట మాటకీ అట్లా కొట్టొస్తే మీకు మామూళ్లట్లా ముడతై ? ఎక్కడో పిచ్చివాళ్లలే వున్నారే ? అసలు మీ మామూళ్ల రివాజెటువంటిదో చెప్పండి.

ప్రభం—మా మూళ్లంటే ?

తిక్క—ఇంతేనా తెలివి. మా మూళ్లంటే తెలియటం లేదా ? మా మూళ్లు పుచ్చుకొనేవాళ్ల పురాణం వ్రాయాలన్నా, చెప్పాలన్నా, గొప్ప గొప్ప కవి చక్రవర్తుల పదునైన మెదళ్ళన్నీ మొనలు విఱిగి బండబారిపోతై, తెలిసిందా?

ప్రభ—అంత సోదెందుకు కొద్దిగా చెప్పు.

తిక్క—కొద్దిగానా! అయితే వినండి. తమకు లోబడ్డ సామంతరాజుల దగ్గఱనుంచి మహారాజులు రత్నహారాల్ని హోదాగా స్వీకరించటం వొకటి. పెద్ద జమీందారులు, చిన్న జమీందారులు, మొఖాసాదారులు, ఇజారాదారులు, దివాలాదారులు మొదలుగాగలవాళ్ళంతా తమచెప్పుక్రింద తేళ్ళమాదిరి పడివున్న ఒక్క రైతుల దగ్గఱ, కూరనారలు, పాలుపెరుగులు, బఱ్ఱ్యానాగళ్ళ్యాతేరగా తెప్పించుకోవటం రెండోమామూలు. ఇంకా ప్రభుసంస్థానాల్లో సర్కారువారి ఆఫీసుల్లో డబాయించీ, గదమాయించీ, చెవులు పిండి వసూలుచేసుకోవటం మూడోమామూలు.

దండ—ఇహా ముగించటం లేవటికా? ఎల్లుండికా?

తిక్క—కొద్దిగానే చెప్పమన్నారు కనుక ఒక గంటసేపులోనే ముగిస్తా. ఇంకా తమ సెలవిస్తే, మళ్ళీ యీనలాఖరుదాకా సెలవిస్తూవుంటాను.

ప్రభం—ఇంకేమీ వొద్దుగాని కట్టిపెట్టు.

తిక్క—సరే, మామూళ్ళంటే తెలిసిందా? ఈమూ స్తరుగావుంటై. ప్రస్తుతం యీబాపతు మామూళ్ళు నాదగ్గఱ అయిపోయినై. యేదోకొంచెం ఒక్కవాణ్ణి వెళ్ళనీయండి.

దండ.- వీలులేదు. మేమేమాత్రం మామూళ్ళపట్టేవాళ్ళంకాం.

తిక్క—పోనీయకపోతే పోనీయకపోయారుగాని దర్బారంటే యెట్లావుంటుందో పోనీ వొకతడవ కంటితో చూట్టానికైనా పుణ్యం కట్టుకోండి.

ప్రభం—దండధరా! పాపం చూచిపోతాడట. కొంచెంచూడనిద్దామా?

దండ-- ప్రభంజనా! మనంకూడా వుండిచూడనిద్దాంపద. పదవయ్యా! మీపేరేమిటి?

తిక్క—తిక్కశాస్త్రి.

ప్రభం—(నవ్వి) భలేపేరుపెట్టుకొన్నావయ్యా!

(ఇద్దరూ తెక్కలు పట్టుకొనివచ్చి దర్బారు చూస్తుందురు)

తిక్క—(ఆశ్చర్యంతో) ఆహా! ఎటువంటి ధర్మపరిపాలన సర్వసామ్రాజ్య. ఎంతమనోహరమైనశాల. చూస్తుంటేకొంచెం నాయనా! ఆ సభాలక్ష్మికి నమస్కరించిపోతాను.

(ఇద్దరూ తెక్కలు విడుతురు)

[తిక్కశాస్త్రి దర్బారులోకి పరుగెత్తును]

ప్రభం—దండధరా! పట్టుకొనుము. పట్టుకొనుము.

దండ—ఇంకా ఏమిటి పట్టుకొనేది? ఎంత మోసం చేశాడు

ప్రభం—వీఁడి వేషమంతా చూచి నే నిందాకే కనిపెట్టాను. నీ వేమను కొంటావో అని వూరుకొన్నాను.

దండ—బయటికి వచ్చినప్పుడు గాని వీఁడి భరతం పట్టను.

ప్రభం—ఇంకా మనకు చిక్కేది కల్ల. పద. దొరలు వస్తారు.

(నిష్క్రమింతురు తెరపడును)

## 3 వ రంగం

## దర్బారు

[సువర్ణరత్నఖచితసింహాసనాలమీఁద భరతమాత, జనకుడు, విజ్ఞాననిధి, ధర్మరాజు, బలుడు, శూరుఁడు, రత్నం కూర్చుందురు. భటులు వింజామరాలు వీచుచుందురు. బ్రాహ్మణులు స్వస్తివాచకాలు చదువు చుందురు. ఊర్వశి భరతనాట్యము సేయుచుండును. పరవశత్వంతో తిక్కశాస్త్రి లేచి ]

తిక్క—(ఊర్వశిని చూచి) ఇది అచ్చగా జారిణివలె తోచుచున్నదే. (సభికులు నవ్వెదరు) ఈనిండుపండితవేదండాలతో, చతున్న

ముద్రపరివేష్టితమైన సమస్త ధరాచక్రాన్ని పరిపాలించు వసుంధరాధురంధరులతో అపరయౌగంధరులవంటి మహామంత్రిశేఖరులతో, గుణగ్రహణపారీణులైన రసికాగ్రగణ్యులతో, నవరసభరితమైన కావ్యములు శ్రావ్యముగా రచించు కవిపుంగవులతో, ఆనందలక్ష్మీప్రసాదం అనుభవిస్తున్న సుజనసముదాయాలతో అలంకరింపబడిన యీనిండుసభామధ్యమందు సిగ్గులేక తైతక్కలాడుతున్న యీనాగరిణి నన్నుజూచి, ముసిముసి నవ్వులతో బిగిబిగి పువ్వులతో సిగ్గుపడటం ఎందుకో నాకేమీ అర్థం కావడంలేదు. (సభలో నవ్వు) ఉండండయ్యా మీనవ్వులు బంగారంగాను. నాగుండెలు గుబగుబామంటున్నై. అంతకంటె నాకు చూపులు భగభగా మంటున్నై. కృష్ణ! కృష్ణ! హరిహరీ (చెవులు మూసుకొని) పాపం శమించుగాక. ఓ బయ్యారిభామినీ! ప్రణయసభలో యున్నాడు నామనోవ్యధ తెక్కసియువారు యేమో? చూడక నావంక, సిగ్గులేని మంచి గంధపుకట్టె!

మ. ముగుదా! యేమగవానికైన త్రుటిలో మోహాంధకారమ్ము సి
జిగివెన్నెల్ నగుమోమునుంచి యుదయించెన్ గాదె? తచ్ఛర్వరీ
గగనాభ్రప్రమదాననాగరిమ సౌఖ్యశ్రీలలామమ్మువై
తెగువున్ గాల్ లగువున్ సరాలబిగువున్ దెప్పింతువెల్లప్పుడున్.

ఇహ నీ బయ్యారాలు కట్టిపెట్టుకొన. సకలసద్గుణ సుకుమారరత్నముల గన్న భరతమాతా! నీవు విశ్వమాతవు.

సీ. చల్లనిదయయె పచ్చనిచల్వపందిరై
ఆనందలక్ష్మి కాహ్వానమంప
సులిగుణాల్ రతనాలతోరణములై
సద్యశోరమ కర్ఘ్యపాద్యమిడగ

మృదుహృదయమ్ములు మెత్తనిశయ్యలై
ధర్మదేవతకు మోదమ్ముగొలుప
వీరలక్షణములు పెట్టనికోటలై
కుటిలజనమ్ముల గుండెలోఁగ

గీ. దండిగలవారలై నీదు తనయులెల్లఁ
గన్న జనకుండు గర్వలక్షణమునుండ
ఈస్వరాజ్య లక్ష్మిమణి నేలగలరు
మురిసి ముద్దులిడఁగ నీవు భరతమాత.

జన—(లేచి) ఈ మహామహుండు కవిసార్వభౌముఁడై అనర్గళమైన వాక్సుధారస ప్రవాహాలతో నా భరతమాత నోముపంటల్ని పండించటానికి వచ్చాడు. ధన్యులము.

కవిసార్వభౌమా!

మ. పరమాహ్లాదముఁ గొల్పు నీదు కవితా పద్మాలయాంతిన్గ్రోలి
ధరణీచక్రమునెల్ల నేలఁగల నాదర్బారు కేతెంచి, స
త్కరుణాశీర్వచనామృతార్ణవ [illegible]
పరలన్ జల్లితి; తల్లిదండ్రి కనుఁబొప్పల్ [illegible].

భరత—(లేచి) దయామయా! సుకవిసునామధేయా!

సీ. ప్రియతరమ్ముగఁ బసిపిల్లలఁ జల్లని
తెక్కలతో సాకు పక్కిగుంపు
రేగనీయక చంటిలేఁగదూడల యొంటి
నబ్బురమ్ముగ నాకు నాలమంద
గృహనిర్వహణ కంటికింపుగ శిశువులకు
చిన్ననాటనె నేర్పు చీమబారు

పౌరుషము కనులువచ్చిన పయి పసి
కొప్పుఁజెప్పసివంగి గొప్పజేసి
గీ. నాకడుపున బుట్టినవి పండబడి నోము
నన్ను కన్నవాఁడవు నీవు కన్నతండ్రి!
భరతమాతకు తండ్రి విద్వాంసులార!
సత్కవివరుండని జగాన చాటుడయ్య.

విద్యా— రవితేజశ్రీకరా! కవిరాజశేఖరా!

ఉ. నేను జగాన నిల్చి జననీ జనకుల్ తలపై నవేయు సు
తాన ఫల ప్రసూన సముదాయ సుధారస సౌరభంబు సం
ధానముఁ జేసి పంచుటకు ధర్మము కర్మము కల్గియున్న వి
ద్యానిధి నయ్య! నీదు కవితా ప్రతిభాగతి నుండు మండగాన్.

ధర్మ - అఖండధారుణీ మండల కవిత్వఖండలా!

ఉ. బంధువు లెల్ల మెచ్చ, పగిపంధుల కన్యాది నచ్చ, నా భుజ
స్కంధము లందు మోపిన, విశాల ధరావలయమ్ము రాజ గ
ర్వాంధత తల్లక్రిందులయి నంబుధి మున్గని తీరునన్ గృపా
సింధుఁడనై నిరంతరము సేయుము సాయము రాజకోటికిన్

బలుఁడు నిర్మల ధర్మపథానువర్తీ! నిఖిల సుకవికుల చక్రవర్తీ!

మ. ఫలితంబౌ సుగుణ ప్రసూన ఫల విభ్రాజోన్నతంబైన శా
ఖలచే దిక్కుల నెల్ల క్రమ్ముకొని లోకాలన్ని కాపాడు నీ
డలదై భారత కల్పతర్వు కసుమేశ్కన్ పండ్లు పండించి యీ
బలునిన్ గావలిపెట్టి; క్రోధులకు నొప్పన్ జెప్ప నీ కెప్పుడున్

శూరు—భరతమాత జనకా! కవికులతిలకా!

ఉ. ఘోరపరాక్రమక్రమ మకుంఠిత రీతిగఁ జూపు శత్రు సం
చార విచార దూరగ్రహాచార పరీక్షక భేద్యమైన యీ

భారతమాత కోటనయి, వజ్రహాలాయుధపాణినైన యిం
శూరుని కప్పు నీరసము సూపని వీరరసమ్ము వోయునూ.

రత్న—భువనైక మనోహరా! సులలితగాన కవితావిశారదా!

చ. చలువలుగూడుకట్టి గుణసంపదకింపుగ నిగ్గునెట్టి, ని
ర్మలహృదయమ్ములై భరతమాతపదాబ్జము పట్టినట్టి యా
న్నల చరణారవిందముల నాతలఁదాల్చుచు వారిసన్నిధిన్
సలలితసేవఁ జేయుటకుఁ జల్లనిదీవెనలిండు నాకిలన్.

తిక్కన్న— ఆహా ఒప్పగింతలపాట లయినట్లేనా? ఉంటే గేసటికేవాయిదా. మీ అందఱిలో, మాతృదేశారాధనను సులలితవాక్సుధానిధియైన విద్యానిధి తన రతనాలకలము పట్టినప్పుడు దానికితోడుగా నా గద్దయీ కాకకలం గూడా వుండాలీ? పూజ్య, సామ్రాజ్యలక్ష్మీ పరివేష్టితమైన భూభారనిర్వహణను తేజోనంగమోద్దుడు నగు ధర్మరాజు ఖడ్గపాణియై భుజముపట్టినప్పుడు వెంటనావంటి అలిసిగిన సన్యాసి వేఱొకదండపట్టాలీ? భారతకల్పవృక్షానికి ఫలించుచున్న సమస్తఫలసంపదలకు శక్తిసామర్థ్యములతో, కావలిఁ గాయుచున్న బలులకు అలవిగాని క్రోతిమూకను ద్రోలటానికి నామాదిరి కొండ్రముచ్చు తోడుకావాలీ? వైరివీరమత్తేభాలక భేద్యమైన కోటముందు గస్తీతిరుగుచున్న వీరశూరసింహకిశోరానికి ఇంకా ఈమార్జాల శాబకముగూడా చేరాలి? దేశసేవాదురంధరుల పాదసేవచేయుచున్న పుత్రరత్నానికి ఈ ఉదరపారాయణ పౌరాణికుల దీవెనలుండాలి? బాగానేవుంది కథ. అయితే నేనింతమందికి అక్కఱకు వచ్చువాణ్ణైనప్పుడు, గర్భదరిద్రం మహాసముద్రమై నాకొంపమీదెందుకు పడాలి? కవికి కడుపునిండనీయకండి. భువికి పిడుగురాలనీయకండి.

[అదుర్దాగా దండధరుడు ప్రవేశం]

దండ—ప్రభూ! ప్రభూ!

విద్యా. (లేచి) ఏమి వచ్చి పడ్డది?

దండ—రాణీగారికి దుస్వప్నంవచ్చి మూర్ఛిల్లారు దొరా!

అందఱూ— (లేచి) దుస్వప్నమా దుస్వప్నమా (నిష్క్రమింతురు)

[బెదురుచూపులతో తిక్కశాస్త్రి నలుదిక్కులూచూచి]

తిక్క—అదేమిటోగాని నాకు దుస్వప్నాలు రావటమే. ఇదేమిటో రాకరాక రాణీగారికి వచ్చిందోలేదో వారలంతా గణాచారులై పరుగెత్తారు. రాజ్యలక్ష్మి దుస్వప్న మేమిటో నేనుగూడా విని వస్తా. సుఖాపురం చేస్తున్న యీ రాజ్యలక్ష్మికి దుస్వప్నాలు రావటమేమిటి ఖర్మ.

(నిష్క్రమించును తెరపడును)

శ్రీ

# విశ్వస్వారాజ్యము

తృతీయాంకము

---

## 1వ రంగం

[మహాసముద్రము మధ్యలోని ద్వీపమునందుండిన నివాసములు చర్మములూ ఆకులూ చుట్టుకొనియున్న భీకర వికారస్వరూపులు తిరుగుచూ ఒకనొకరిపై వాలకరు బోర్లపడుచూ గంతులిడుచూ ఘూర్ణిల్లుచుందురు. తనకొడుకుల్ని దరిద్రదేవత వోదార్చుచుండును.]

కీర్తన

[భేతాళుడు ప్రవేశం]

భేతా—తల్లీ! విలపించుచున్నావెందుకు?

దరిద్ర—నాతండ్రీ! భేతాళా! వచ్చావుగదా. కూడుగుడ్డకు కఱవైన యీ లంకలో మిమ్మల్నిగని ఆకలిమంటలో పడేసి మలమల మాడ్చుకొని తింటున్న నేను కడుపుపగిలి దుఃఖసాగరంలోబడి మీ బ్రతుకుతెరువుకోసం తూర్పుదిక్కుగా పోయాను. అక్కడ,

సీ. బంగారుకొండలే ప్రాకారములభంగి
చూపుకందనివొంచు చుట్టుగలవు
పాడియావులు నిచ్చు పాలధారలకెల్ల
జిడ్డుకట్టిన పోతుగడ్డ సుమ్ము

భువనైకసౌందర్యముగ రత్నములఁ జెక్కి-
కట్టినమేడల గరిమయేమి
ఐశ్వర్యమదమున విశ్వవీరులపైకి
కాలుద్రువ్వుజనాళి గర్వమేమి
గీ. చెప్పగలదా నరా! నాదు త్రిప్పలెల్ల
దేవుని కెఱుక అచ్చోటి చేవయేమొ
తిరిగి రాకుండ నాకు బుద్ధినిడిరయ్య
భారతీయులు కండకావరము కొద్ది.

శ్వేతా. (పండ్లు కొఱికి) ఓరీ కౄరులారా! సమదాంధులారా!

కీర్తన

ఔరా! భారతీయ! అష్టైశ్వర్యం మీ కనులు పూడ్చినదిగా మీ పూర్వదురాగ్రహమస్తమదోగ్రబలం యీ శ్వేతాంగశక్తిపై జూపి వీరాలాపములాడుదురుగాక. మీ అసమానమేధాశక్తి యీ శ్వేతాంగసామ్రాజ్యశక్తిపై డీకొలిపి విజయధ్వజము సంస్థాపించుకొందురుగాక. భారత సామ్రాజ్యధారేయ! భారతీయ! నీయింటి మకరాన్నే పెకలించి యురికంబముగా పాతి నిన్నురితీయనిదే నిద్రింతునా? నా చండశాసనం తిరస్కారం చేసి ఆజగచ్ఛత్రువైన మార్తాండుడుగూడా వెలుఁగగలడా? తల్లీ! శ్వేతాంగసామ్రాజ్యకల్పవల్లీ! ఇహ భారతదేశానికి పోయి

మ. కులముల్ జీలికపీల్కెఁ జేసి, కలిమిన్ గోత్రాల కత్తించి, మూ
తులుఁ గట్టించి, వధించి వీరవరులన్ ద్రోయించి పాథోధిలో
మెలతల్ గర్భములోని పిండములు భూమిన్ దొర్లగర్జించి, ఆ
వలభేతాళనృపాలకత్వమును నిల్పన్ జేసి యేతెంచెదన్.

సెలవిమ్ము తల్లీ! నీ చల్లని దీవనలున్నప్పుడు మాకేం భయం.

దరిద్ర—అతలవితలపాతాళాలలోకాలనెల్ల గిజగిజలాడించగల భేతాళా! నీశక్తి అఖండం. అంతకంటే భారతీయులశక్తి అలంఘ్యమైనది. కనుక నీకు తోడుగా నేను మోహినీవేషముతో వచ్చి, భారతీయులనందరిన్నీ వశపఱచుకొని నీకొప్పగిస్తాను. అప్పుడు నీచేతిలోంచి తప్పించుకొనటం వారితరంగాదు.

భేతా—అట్లే గావించుమతల్లీ! తమ్ముడా! భైరవా!

భైర—అన్నా! ఏమి అనుజ్ఞ.

భేతా—సమస్తమూ వింటివిగా. రేపు భారతదేశానికి ప్రయాణం. నీవక్కడ నావెంట జాగ్రత్తగావుండి శత్రువాసన పసిపట్టి చెబుతుండాలి.

భైర—పసిపట్టడమే గాక, నాకసికొద్దీ, అనుండగించిన నెల్లాళ్లవగ్గిం కీడ్చుకొస్తాను. పదా. (నిష్క్రమించు తెరపడును)

2వ రంగం

[భారతదేశ సంస్థానపు అంతఃపురం]

రాజ్యలక్ష్మి ఒంటరిగా పూలశయ్యమీద కూర్చుని విలపించుచుండును

కీర్తన

ఈ భయంకర దుస్స్వప్నభయానక దృశ్యం నా భావిభాగ్య సామ్రాజ్యవినాశకాలాన్ని చూపిస్తున్నది. ఆ...ప్రచండశపథంచేసి నన్ను చేపట్టిన నాపతులానన్ను విడనాడి అన్యసామ్రాజ్యకాంతకు పాదదాసులుకావటం? నేను సహించను. ఆ...ఎంతసాహసం? అన్యసామ్రాజ్యకులట నన్ను కాలితోతన్నునుగా? అనుపమాన మేధాసంపన్నులై సింహపరాక్రమశాలులైన నాపతులు

నాఅవస్థజూచి మిన్నకుండెదరా? దైవమా! కటాక్షింపవా! అత్తా! భరతమాతా! నీకోడలికింక దిక్కు భీకరమృత్యుదేవతాముఖమేనా? మామా! జనకరాజసార్వభౌమా! నీకుమారులకూ, నాకూ ఎడఁబాటవటంవల్ల నీబంగారులోగిటికి అనర్థకముగాదా? అయ్యో! భూదేవతా! నాబ్రతుకు నీకుభారమా?

[భరతమాత ప్రవేశం]

భరత—తల్లీ! భరతరాజ్యలక్ష్మి! ఎంత పిచ్చిదానవమ్మా!

చ. జగమున నేను గొప్పగ యశంబు గడించుట నీదు భర్తలై
మగురి భుజాలలో బిగువులోఁగదె! తద్భుజ శక్తికెల్ల యీ
జగతియె భారమైన సిరిసంపద లుండఁగ నింద భూమికిన్
దగని భరంబె నీవు కల తల్పకె నీతొఁగ కన్నునల్పకే.

కలకు కలఁతపడదగునా?

రాజ్య—అత్తా! భరతమా...!

చ. కలకలగాదు నాపసిఁడి కాపురమున్ మసిఁ జేసి, గంగలోఁ
గలిపి, యపూర్వ శౌర్యబల గర్వ యశోధనులైన ప్రాణనా
థుల నెడఁబాటుచేసి పసితో కసితీరక దానికింక ని
క్కడి మగవారి కెల్లరకు గాజులు తొడ్గెడి పీడయే సుమీ

[రత్నం కోపంతో ప్రవేశించును]

రత్న—ఎందులకీ అకారణ భయం?

చ. కలకు నులిక్కిపడ్డ, పులిగడ్డకు సంతలొ కాకిగ్రుడ్డు కా
వలసిన కర్మమే విధిగఁ బట్టునె? నీ మగలెల్లరంత గా
జులు తొడిగించుకోదగిన శుంఠలటే యిల రాజ్యలక్ష్మి! నీ
కలయె హాళక్కగాని తలిగాంతువు భారతజాతి శౌర్యమున్.

(నిష్క్రమించును)

[శూరుడు ప్రవేశం]

శూరు—ఏమిటీ వెఱ్ఱి మొఱ్ఱి అనుమానాలు.

మ. కల కేకల్లను బొంద, కోమల కళా కళ్యాణ కాంతి చ్ఛటా
నిలయంబై విలసిల్లుచున్ ఫలితసత్కీర్తిన్ గర్భంబులో
గల పాపాయిలు వీరకేసరులుగా, గర్వించు కుట్లో గదే
నళినీబాంధవ భోజరాజ తరుణీ, నారాజ్యలక్ష్మీమణీ.

(నిష్క్రమించును)

భరత—తల్లీ! రాజ్యలక్ష్మీ! నా చిన్నారి కడుగొట్టు బిడ్డలు మాటలు వింటివా? పిచ్చిదాన! వగవక.

[బలుడు ప్రవేశం]

బలుడు—అమ్మా! భరతమాతా!

చ. అలకయుఁ గల్వరింతయు, భయావహమైనవిహీనచేష్టయున్
గులమునకెల్ల హానిగలగొయ్యని తియ్యఁగలట్టి శత్రుయున్
గలనయినన్ సహింపనివికాసిని భారతరాజ్యలక్ష్మి, ని
ష్కలుషగదమ్మ! పీడగలఁగాంచుటచే, మనః కలుషమూనునో.

భరత—నాయనా! పరిపరివిధాల మీరుకూడా అధైర్యం పడకండి. ఫరవాలేదు. (బలుడు నిష్క్రమించును)

[ధర్మరాజు ప్రవేశించును]

ధర్మ—తల్లీ! ఏమిటీగోడవ?

సీ. పసిఁడిపీఠమున పేర్వాసితోఁగూర్చుండి
మమ్ముఁగాచిన వేదమాతలార!
సుగుణలతలపై మెలఁగుచు మాకీర్తి సౌ
రభముగుప్పెడి యశోరామలార!

ఐశ్వర్యఫలము ప్రజాభిమానసరణి
దయనిచ్చు పారిజాతంబులార!
పిడుగులురాల్చుచు పాడలగొట్టి రిపుసం
తతిముంచు చెదరనిధైర్యలక్ష్మి!

గీ. సకలభాగ్యభోగ్యవిశాల సత్యధర్మ
శీలసుకుమారికా గుణాపాలికావి
రాజితలతిక యైన నారాజ్యలక్ష్మి
ప్రాణములుతీయ కలకుకారణమదేమి?

(నిష్క్రమించును)

[విద్యానిధి ప్రవేశించును]

విద్యా—భరతసామ్రాజ్యలక్ష్మి! నీసుతులు దుర్గతుల పాలై పోతున్నారని చింతిస్తున్నావా? లేమిటి? ఎందుకింత దిగులు పడివున్నావు. మా ప్రభుత్వం సిగంకుశత్వముగా లేనప్పుడు నీ కేల యీ పాడు వగపు? దురాలోచన, దురాశాపీడన, దుర్మార్గపరివర్తన, మర్షితకథాశ్రవణ, భావికాలగర్భవిచ్ఛేదన, అకారణఖేదన, దుస్స్వప్నపరిచింతన, యీ మొదలైనవి దోషభూయిష్టములైనవని యెఱుగవా? మగువా? నీ తలంపుల కిది శ్రేయస్కరంగాదు.

ఉ. నీ నగు మోము రాజ్యమున నిగ్గుగ ముత్యపు ముగ్గువెట్టి నే
డీ నృపకోటి గొప్పం దనమేలిన దానవె! రాజ్యలక్ష్మి! చం
ద్రానన వైన నిన్నిల నమాంతము క్రిందగెడి పాదురాహు వే
దైన తటస్థమయ్యెనె? భయాన మృణాళముకీతి వాడకే.

(నిష్క్రమించు)

భరత—అమ్మా! నీ మాటమగా కొస్తున్నారు.

రాజ్యలక్ష్మి, భరతమాత నిలబడెదరు

జనకు—అమ్మా! రాజ్యలక్ష్మీ! సర్వమంగళప్రదమైన నీ బంగారు పాదాలు నాయింటికి వచ్చి దెచ్చిపెట్టినై. నా కుమారుల కీర్తి ప్రతిష్ఠలకు అలంకారం తెచ్చిపెట్టినై. నీ ఉత్తమాంశములున్న మా జన్మ తరింపఁ జేసినై.

ఉ. నీవరహాలనోమున వినిర్మలధర్మపథమ్ముఁదప్పకెం
తోవిజయమ్ముగానడుచు దోర్బలవంతులు నావుబిడ్డలీ
చేవఁగలట్టిగడ్డపయి చెడ్డకలల్ కనపడ్డమాత్రమే
జీవముపోయిరాజ్యము త్యజింతురె? చింతిలకమ్మ శోకలా.

[తిక్క—శాస్త్రి ప్రవేశం]

తిక్క—కలా! కలకలా! ఈకలా? పీకలా? పోకలా?

జనకు—అదేమిటండోయ్ మీగోడవ?

తిక్క—గోడవా? కలాగోడవా? కలకలాగోడవ? ఈకలాగోడవ? పోకలాగోడవ?

జనకు—తెలియలేదండి.

తిక్క—కలకా? కలకలామనిరాద్ధాంతం? ఈకలాలేవు పీకలాలేవు. పోకలాలేవు. పిట్టేమోగదా పట్టుకుందామంటే, అగ్గిగుగ్గిలకలా! ఆడదానికలా అబద్ధానికి దాఖలా.

(నిష్క్రమింతురు తెరపడును.)

3 వ రంగం

సముద్రపుదరి

[భేతాళుఁడూ, భైరవుఁడూ, మోహిని పడవలోంచి ప్రవేశింతురు]

భేతా—తల్లీ! ఈభరతఖండం ఎంతభాగ్యవంతమైందమ్మా?

భైర—ఆహా! భూమండలం మీద యిటువంటి బంగారుగడ్డ వుందని యిదివఱకు మనకు తెలియదుగదా. ఇక్కడ వీస్తున్నగాలికే బ్రతుకవచ్చు.

మోహి—బిడ్డలారా! మీపటుతరధైర్యసాహసాలతో మీమహేంద్రజాలవిద్యాప్రభావంతో, ఈ హిందూదేశంలోని గాలినిగూడా మనకాలిదగ్గఱకు రప్పించుకొని మనదయవున్నప్పుడే నలువైపులా పోవటానికి అనుమతి నియ్యాలి.

ఉ. జారినకొప్పు నాకపుడు చక్కని దూముడి కెల్లవచ్చు; ఈ మారణభూమిపై కడుపుమండిన మంటకు, కంటిమంట చల్లారు; త్రిలోకవీరులెదురైన మిమునడ్డినగూడ, మీరలీ భారతజాతినిర్ణ విడువవద్దటికాలను ద్రొక్కిపట్టుడీ.

ఉ. తాళుము నీదుకంటితడి తక్షణ మారకమువ్వె; సర్వభూగోళముమోయుఁ గల్మిగల కూర్ముఁడు శేషుఁడు మూడు చిట్టిపాతాళములోన గూలఁబడుతాకిడి త్రొక్కిడి మూడునట్లు భేతాళుడు కాలునెట్టెఁగదె తాండవమాడఁగ భారతావనిణ.

లోకభీకరమైన అస్మత్ప్రచండ వీరరౌద్రభయానక భీభత్సరసాలతో ప్రళయకాలసముద్రాన్ని పుట్టించి యీభరతఖండాన్ని వొక రెప్పపాటుకాలంలో ముంచివేస్తాను. ఇంకాఎవఁడు డీకొనగలడో చూస్తాను.

మోహి—కుమారా! తొందరపడకుము. భారతీయులు సామాన్యులు కారు. వారిని శూరత్వంతో గెలవటం ఎవరితరంగాదు. మనంవారిని మహామాయోపాయాలతో వశంచేసుకోవాలి. అందుచేతయిప్పుడిక్కడ మీమహేంద్రజాలవిద్య నుపయోగించాలి. దానికింకాతోడుగా మోహినీవేషంతో నేను మీ

వెంటవచ్చినవాళ్ళని వశంచేసుకొని మీకొప్పగిస్తాను. అప్పుడింకా యీభారతవీరులలో నొక్కొక్కరికీ ద్వేషాలుపుట్టించి సాధించి జయించగలం. మీరు వర్తకులుగా చెప్పుకోండి. నన్ను మీతల్లియని చెప్పండి. జాగ్రత్త! అభయంకరస్వరూపుడు ఈదేశపుసేనాధిపతి, వస్తున్నాడు. నాకు తెలుసున్నాను మీరు కోపగించుకోకుండ నాకేమి చేసినా, మీరత్యవినయంతో పడియుండండి. భయంలేదు మీకన్నివిధాలా నేను రక్షకురాలనై యుంటాను.

భేతా—తమ్ముళ్లారా! భైరవా! వింటిరా! తొందరపడక.

భైర—(ముందుచూచి) భయంకరుడువస్తున్నాడు.

(అందరూ మిన్నకుందురు)

[ప్రభంజనుడు ప్రవేశం]

ప్రభం—ఎవరు మీరు?

భేతా—మేము వర్తకులం స్వామి!

ప్రభం—మీరీ దేశస్థులుకారే? మీ దేదేశం?

భేతా—మాది పడమటిదేశం.

ప్రభం—పడమటిదేశమా? ఇక్కడికి కుదు కొచ్చారు?

భేతా—వర్తకం చేసుకొని బ్రతకటానికి.

ప్రభం—ఆమె యెవరు?

భేతా—ఆమె నాతల్లి. అతడు నాతమ్ముడు.

ప్రభ—మీరు పరదేశస్థులు కావడంమూలాన మా ప్రభువుగారి అనుమతి తీసుకోవాలి. లేదా మీరొక్కనిముషం కూడా యిక్కడ నొక్క అడుగుమేర కూడా నిలవటానికి వీలులేదు.

భేతా—ఎక్కడికి పొమ్మంటారు?

ప్రభం—ఎక్కడికో చెబుతానులే, నోరెత్తకుండా ఇహ నా వెంట రండి.

భేతా—చిత్తం.

(అందఱూ నిష్క్రమింతురు. తెరపడు)

4 వ రంగం

భారతదేశ రాజకీయమందిరం

[విద్యానిధి, ధర్మరాజు, బలుఁడు, శూరుఁడు, గద్దెల ఆసీనులై వుందురు. దండధరుఁడు ప్రక్క నిలబడివుంటాడు.]

విద్యా—దండధరా !

దండ—ప్రభూ !

విద్యా—రాజ్యంలో సామంతరాజులంతా క్షాత్రవిద్యాసంపన్నులై, ధర్మపరిపాలనా దక్షులై వున్నారా? లేక అల్పరాజ్యాధికార మదోన్మత్తులై ప్రజల్ని హింసించుచున్నారా?

దండ—ప్రభూ! ఏలినవారి ధర్మశాసనపరిపాలనా బద్ధులై వున్నారు. ప్రజల్ని కన్నబిడ్డలమాదిరి చూచుకొంటున్నారు.

ధర్మ—దండధరా !

దండ—ప్రభూ !

ధర్మ—రాజ్యంలో పంటలుపండి ప్రజలు చతుర్విధపురుషార్థాల్ని బాగుగా పాటించి సుఖముచుకొనుచున్నారా? లేక జారచోరాది భయాల్తో బాధపడుచున్నారా?

దండ—ఏలినవారి ధర్మపరిపాలనానిర్వహణంవల్ల సమస్తైశ్వర్యాలతో, దైవభక్తితో ప్రభువులను కన్నతండ్రులుగా పూజించుకొని ప్రజలు నిత్యానందభరితులై సుఖజీవనం చేస్తున్నారు.

లుఁడు—దండధరా !

ండ—ప్రభూ !

బలుడు—రాజ్యంలో సమస్త శిల్పకళాన్వేషులను ప్రోత్సాహపరచబడు వర్ధిల్లు తున్నయ్యా ?

దండ—ఏలినవారి ధనలక్ష్మీకటాక్షంతో సమస్త శిల్పకళాన్వేషులను ప్రోత్సాహపరచబడులు విరివిగావుండి చాలా అభివృద్ధిలో వున్నవి.

శూరు—దండధరా !

దండ—ప్రభూ !

శూరు—రాజ్యంలో హాలికులైన రైతులును ధాన్యాన్ని పండించుకొని, ప్రభుహింసలేక శూరులై నీతివిద్యావిశారదులై వున్నారా ?

దండ—ఏలివారి అవ్యాజకరుణాకటాక్షంతో రైతులు పాడిపంటలు సమృద్ధిగాపండి నీతివిద్యావిశారదులై, శూరాగ్రేసరచక్రవర్తులై వున్నారు.

రత్న—దండధరా !

దండ—ప్రభూ !

రత్నం—రాజ్యంలో ప్రజలు మాతృపితృభక్తిపరాయణులై దేశారాధకులై, విశ్వజనసౌభ్రాతృత్వంకలవారలై, ఆయురారోగ్య భాగ్యాలుగలవారలై జీవించుచున్నారా ?

దండ—ఏలినవారిచల్లనిదయతో ప్రజలు తనుతలిదండ్రులపై భక్తిగలవారలై, మాతృదేశారాధకులై దీర్ఘాయురారోగ్యభాగ్యవంతులై కలసి మెలసి బ్రతుకుతున్నారు.

(ప్రభంజనుడు, భేతాళుడు, భైరవుడు, మోహిని వరుసగావచ్చి నిలబడెదరు)

విద్యా—ప్రభంజనా ! వీరంతామెవరు ?

ప్రభం—పడమటిదేశస్థులు.

విద్యా—ఏమిఅవసరంమీాద వచ్చారు ?
ప్రభం—వర్తకం చేసుకొంటానికి.
విద్యా—ఏమివర్తకం ?
ప్రభం—పింగాణీవర్తకం.
విద్యా—వీరిపేర్లేమిటి ?
ప్రభం—(వర్తకులతో) మీ పేర్లు చెప్పండయ్యా !
శ్రేతా—నాపేరు ఆనందం. నాతమ్ముని పేరు సత్యం నాతల్లిపేరు జగన్మోహిని.
విద్యా—మంచి సునామధేయులు, వినయశీలులు.
ధర్మ—ప్రభంజనా ! వీళ్లకు తగు సుఖ్యాదకర నివాసాలు చూపించండి.
ప్రభం—చిత్తంప్రభూ !
బలుడు—ప్రభంజనా ! వీళ్లకు కావలసిన సౌకర్యములన్నీ చూపించండి.
ప్రభం—చిత్తంప్రభూ !
విద్యా—ఆనందసునామధేయా ! మా విశ్వసామ్రాజ్యంలో, వ్యాపారం చేసుకొని సుఖజీవనం చేయండి.
శ్రేతా—చిత్తంప్రభూ ! ఏలినవారి అనుగ్రహభాగ్యంతో చక్కగా జీవిస్తుంటాం.
ధర్మ—ప్రభంజనా ! ఆలస్యంచేయకుండా వీళ్లకు చక్కని నివాసాలు చూపించండి.
ప్రభం—చిత్తంప్రభూ ! అయ్యా ! ఆనందంగారు నాతో దయచేయండి.
(అందరూ నమస్కరించి నిష్క్రమింతురు)
విద్యా—దండధరా ! రాజ్యంలో ప్రజలు ఏవిధమైన కష్టాలు పడకుండా చూస్తుండుము పొమ్ము.
దండ—చిత్తంప్రభూ ! (నమస్కరించి నిష్క్రమించు)

విద్యా—ధర్మరాజా! ఈవచ్చిన పరదేశస్థులు చాలా సుజ్ఞానస్థులు. బుద్ధిమంతులు.

ధర్మ—చిత్రం. అఖండవ్యాపార విద్యాపాటవం గలవారిమాదిరి కనిపిస్తున్నారు.

బలుడు—చిత్రం. అనుపమాన మేధావంతులుగా కనిపిస్తున్నారు.

శూరు—అన్నలారా! ఆశ్చర్యంగా వుంది.

ఉ. వచ్చిన క్రొత్తవారి పరివర్తన మెట్టిదొ గాంచకుండ బల్
మెచ్చుట బుద్ధిమంతులకు మేల్పనిగాదది; లోకమందు పైన్
ప్రముచ్చులు పట్టుపచ్చులుగ మొట్టమొదల్ కనిపించి పమ్మటన్
గుచ్చితరీతి గొంతుకుడిచెను చ్చులమాటి మారవచ్చునే.

రత్నం—అన్నలారా!

ఉ. వర్తకులన్న మున్నెప్పుడు వచ్చినమోములు గారె వీరు? ఆ
మూర్తులఁబట్టిచూడ భువి, మున్ మయి రావణమూర్తులో కల్లా
నర్తకులో, స్వతంత్రసుగుణప్రియభాషిత భారతావని
కీర్తిలతామతల్లులకు కేవలమావల వేరుపుర్గులో.

విద్యానిధిలేచి

విద్యా—కార్మికరత్నమా! అమంగళకరం వాక్యాల్ని మానుకొందాము. అతిథులు, ఆర్తులు, ఆపన్నులు ఆశ్రయించటానికి వచ్చినప్పుడు లేనిపోని అపోహాలకు పోరాదు. మీరు చంటివారు. మీకు తెలియని మాటలు పెద్దలెదుట బోధకుల మాదిరి సాగించి ప్రసంగించకూడదు.

(నిష్క్రమించును)

ధర్మ—తమ్ములారా! అన్నలంత అవివేకులుగారు (నిష్క్రమించు)

బలుడు—తమ్ములారా! అన్యథా ఆలోచించక అధిక ప్రసంగాలు చేయక మీ మీ కర్తవ్యాలలో వుండండి. (నిష్క్రమించు)

శూరు—తమ్ముడా! కార్మికరత్నమా! కూలివీరా! మనమీద, మన సలహామీద యెన్నడూ విసుగందని అన్నలకు యింతలో కోపం రావడానికి కారణమేమోగదా.

రత్నం—అన్నా! రైతురాజా! "ప్రమాదో ధీమతామపి" ఎంత పెద్దవారికైననూ పొరబాటు వస్తునేవుంటుంది. ఇంకొకరు తమ పొరబాటు చూపించి చెప్పినప్పుడు కోపం రాకతప్పదు. అందులో మన వంటి చిన్నవాళ్ళు చెప్పినప్పుడు కోపంరాక శాంతం వస్తుందా? పదా.

(నిష్క్రమింతురు తెరపడును)

శ్రీ

# విశ్వస్వరాజ్యము

## చతుర్థాంకం

### 1వ రంగం

[జగన్మోహినీ గృహము, చక్కని అలంకారాలు చేసుకొని మోహిని ప్రవేశం]

కీర్తన

భారతసామ్రాట్టు లంతా నావలలో బడ్డారు. ఇంకా వీళ్ల సకల సామ్రాజ్యం నా హస్తగతం చేసుకొని నా కుమారుండైన భేతాళుని కొప్పగిస్తాను. ఈ భారతసామ్రాట్టులనెల్ల నాపాద దాసులుగాజేర్చి అడుగులకు మడుగులొత్తించుకొంటాను. ఎదిరించిన చెడుగులను నానాహింసలూపెట్టి నాకాలిక్రింద అణచిపెట్టి వుంచుతాను. అప్పుడుగాని అంత హంసతూలికాతల్పమున కులుకుతున్న భారతమాత అడవులపాలై, దిక్కులేనిదై, చచ్చిచావనిదై వెనుకటి యైశ్వర్యమదాంధత పోగొట్టుకోదు. నవరత్నాభరణాలతో కులుకుతున్న యీభారతరాజ్యలక్ష్మి అప్పుడుగాని నాకుమారుల పాదము పట్టదు. తనకుమారుల శక్తి సామర్థ్యములు చూచుకొని యింతమిడిసి పడుతున్న యీజనకమహారాజు చెట్టుగుట్టలుపట్టి, ఘోరసంకట

దావాగ్నిగుండాల్లోబడి, కుమిలికుమిలిగాని చావఁడు. ఆనాఁడు గాని నాకనులు చల్లారవు. నాకుమారుడయిన భేతాళప్రభుత్వంలోగాని నానోములన్నీ పండవు.

[భేతాళుడు ప్రవేశం]

భేతా—తల్లీ! మన సమస్తసంకల్పాలు నెఱవేఱుసమయం వస్తున్నది. నామహేంద్రజాలమంత్రం పాఱుతున్నది. ఈ భారత సామ్రాట్టులలో నొకరొకరికి మనస్పర్థలు పుడుతున్నై. ఒకరొకరిపగసాధించుకొంటానికి నన్ను సలహా కోరుచున్నారు. సహాయం కూడా చేయాలని వేడుతున్నారు. నేను వొకరితో నన్నమాట వేఱొకరికి తెలియకుండా నా స్వస్థివాచకాలతో అక్షతలు తుదకందఱితలపైనా చల్లటానికి ప్రయత్నిస్తున్నాను. తల్లీ! నీవీలోగా నీదగ్గఱకు వచ్చినరాజుల నెల్ల మోహాంధుల్ని జేసి యొకమూల కట్టిపడవేయుము. అప్పుడు నాఅభినవ చాణక్యుని చాకచక్యం సిద్ధిస్తుంది. అదిగో! చూడు వారిలో జ్యేష్ఠుఁడైన విద్యానిధి వస్తున్నాడు. కడుజాగరూకతగా మెలగాలి. భైరవుఁడు కడునేర్పుతో కావలి కాయుచున్నాడు. మాట్లాడక. (మౌనంతో వుందురు)

[విద్యానిధి ప్రవేశం]

భేతా—దయచేయండి.

విద్యా—నమస్కారం. ఆనందంగారు (ఆసీనుఁడై) మీరు చెప్పినట్లు నాతమ్ములంతా కుట్రకుదిగి నన్నీనిఖిలసామ్రాజ్యాధికారంనుంచి తొలగించి నాసింహాసనంకూడా వాళ్ళే స్వాధీనం చేసుకొందామని పన్నుగడ పన్నుతున్నారు కృతఘ్నులు, విశ్వాసఘాతకులు.

ఉ. పెత్తనమందుఁజూపువడి పెద్దనితల్పక రాజమార్గదో
ష్మత్తతచేఁగలేబడినమాత్రను భారతజాతిరాజ్యసం
పత్తికి విత్తనంబులిలపై వెదఁజల్లుసువర్ణలేఖినీ
చిత్తము దేపెత్తునను జిల్లదు ఏటికి భూమిపైఁదే.

"వినాశకాలే విపరీతబుద్ధిః" అన్నమాటకి సుస్థిరసాక్షిగా ఇంగ్లీషు రాజ్యం నిల్వనిత్తునా?

భేతా—మీరేమాత్రం భయపడనక్కర్లేదు. మీకోసం మా సర్వస్వం ధారపోస్తాం.

మ. అపచారమ్ముల కాలుష్యాలుగు దుర్గ్రహకారధిక్కారగ నీ
రపరాధీనవికారమానవులుగా భ్రాతృత్వమున్ వీడి, మీ
కపచారమ్ము ఘటించు మీ యనుజమూర్ఖాగ్రహమున్ గాల్చియు
తపనక్షేమమ్ముఁ గ భారతావనికి నేతల్ జేతు విద్యానిధీ.

మోహి—నాతండ్రీ! ఈపూజ్యులే సర్వసామ్రాజ్యాధిపత్యానికి అర్హులు. తప్పనిసరిగా నీవీపనికి నడుంకట్టుకోవాలి. అసలు మనకిచ్చట భిక్షపెట్టి నిలపెట్టింది యీమహామహులు.

విద్యా—అదేమిటి! మీరడుగుపెట్టిన వేళావిశేషమే నిరాఘసుస్థిరమైన నివాసం చూపించింది. మీకు మేము చేసినసహాయం రవ్వంతయూ లేదు.

భేతా—అట్లాసెలవివ్వకండి. ఇదంతయూ తమ అనుగ్రహమే.

[భైరవుఁడు ప్రవేశం]

భైర—అన్నా! ధర్మరాజుగారు నీకోసం కబురుచేశారు.

భేతా—అయ్యా! వెళ్ళి సమస్తం తెలుసుకొస్తాను.

విద్యా—మంచిదిబాబు. (భేతాళ భైరవులు నిష్క్రమింతురు)

విద్యా— నా తమ్ములంతా వొకటై నన్ను పదభ్రష్టుని జేసి ఒక్కక్షణం సింహాసనాధ్యక్షులై వుండగలరా? దీనికి రాజ్యలక్ష్మి సమ్మతిం చునా? ఒకవేళ సమ్మతించి నట్టైతే, దాని పూర్వవైభవం నిల్చునా?

మోహి— ఆమెకు మీ పయిన భక్తిపుందని యింకనూ మీకు నమ్మక మేనా?

విద్యా— లేకేమి!

మోహి. చాలా భక్తిగానేవుంటలెండి. మీరు నా గిడసం ప్రోనక్కట మీ రాజ్యలక్ష్మికి గిట్టక, నన్నెన్ని ఆడిపోస్తే యేమిగాని, మీరు దైవసమానులైన భర్తలుగదా; మీ తమ్ములెక్కడా దూరి అసహ్యగించుకోట మెందుకు?

విద్యా— అదెప్పుడు?

మోహి. మీ తమ్ములు మీ మీద సందవారాపిసస్పుడు.

విద్యా— ఏమని?

మోహి— పాశ్చాత్య మోహినీదాసుడని.

విద్యా— ఔరా! కృతఘ్నులారా! ఇంక మీరు నాకు తమ్ములా? పాపకర్ములుగాని.

ఉ. పౌరుషమున్న సి భరతవంశ విభూషిత సద్యశోమణీ
హారమునున్న నన్ను పరిహాసము సేయుటగాదు; సర్వ భూ
భారముఁ దాల్చునా కలపుపాళి మొనన్ గదలించి మీ మహా
వీర పరాక్రమంబుని నో, పెద్దెడి పేరునో మోయుఁడీ ధరన్.

మామకరసరాజ్యమనోభిరామసరణీ! జగన్మోహినీ!

మ. కలలోనన్ మనకాలిగోటికి పరీక్షన్ బోల్పగా నిల్తురే?
నళినీ కోమలపాణి నల్లవకళానైర్మల్య సుస్నిగ్ధగ్రం

ధలతాతన్వియు; రాజ్యతంత్రీఘనమేధాయోధ సాధోధి ద్రో
ర్బలధౌరేయులు; సంపదానదములలో రాజ్యాధిపత్యములలోన్.

తమ్ముల బెదిరింపులకూ ఈరాజ్యలక్ష్మి ఆదరింపులకూ, మనమూ జంకువారలం ?

మోహి—మనోహరా ! సకలనిద్యాధురంధరా ! ఈసంతోషము మనప్రణయ సుధారసప్రవాహం చెదరచేయటానికి చూస్తున్న మీ తమ్ములు మనకింకా పగవారు. వాళ్ళపొగతీయనిదే మీకు నేను దక్కను. దక్కినను నిష్ప్రయోజనం.

విద్యా—తమ్ములుకారు ఘనుపాసమ్ములు. తాలిమిలో బెట్ట సాగగొట్టిస్తే గాని దారికరారు. వారి కంటకావర మేమిటో చూచివస్తా.

(దూసుడుగా నిష్క్రమించు)

మోహిని—ఇప్పటి కితనికి తమ్ములపై పగ తలకెక్కింది. ఇంకా కార్య సాధనం సుకరం. దుర్గర్వతేజోవంతుడు ధర్మరాజు. ఇతని కోరలీతక్షణమేలాగిస్తా (చూచి) వస్తున్నది ధర్మరాజేనే. (మౌనము)

[ధర్మరాజు ప్రవేశం]

ధర్మ—జగన్మోహినీ చిన్నబోయి వున్నావేమి ?

మోహి—దయచేయండి విందురుగాని.

ధర్మ—(ఆసీనుడై ) ఏమది ?

మోహి—ప్రళయం.

ధర్మ—(ఆశ్చర్యంతో) ప్రళయమే ?

మోహి—ధర్మరాజు రాజ్యాధికారాపహారణం.

ధర్మ—(కోపముతో) ఏక్రూరుని దుష్టసంకల్పమో ?

[భైరవుడు ఇస్కీబుడ్డి పెట్టిపోవును]

మోహి— తొందరపడకండి. మీకది తెలియదేమోనని చింతిస్తున్నాను. సర్వమూ వినిపిస్తాను. (ఇస్కీ- అందిస్తూ) కొంచెం మీరిది స్వీకరించండి. మంత్రీంద్ర దురాలోచన ఇహ సాగనిస్తానా ?

ధర్మ—(ఇస్కీ పుచ్చుకొంటూ) ప్రళయకాల బడబానలమైనా (గుటకలువేసి) ఢీకొనటం ?

మోహి—మీ పెద్దన్నగారయిన విద్యానిధులట దీని కంతటికీ కారణం.

ధర్మ—ఆ ఆ అనుకొన్నంతా అయినదిగా !

ఉ. మానవనాథులందఱికి మాన్యుఁడనై మదినిన్ను పెద్దగా
బూనియు నీగురుత్వము, ప్రభుత్వము నే నలందాల్చుచుండి నీ
మానము నిల్పఁబట్టి యిదియా మార్గమునట్టి నిరాశపుట్టి, వి
ద్యానిధి ! రాజపీఠమును దానవిహానము పెట్టనెంతువా ?

[విద్యానిధి కోపావేశముతో ప్రవేశించును]

విద్యా—ఏమిటి ప్రేలుతున్నావు ?

ఉ. ఓరి ! కృతఘ్న ! నామయిని యుగ్రశతఘ్ని భయోగ్యనేల నీ
దారుణరాజగర్వబలదౌష్ట్యము పోటకు మిట్టిముట్టు నీ
పౌరుషభాషణంబులిఁక పల్కుటకుల్కుట కట్టిపెట్టు, నీ
ధీరతనంబదేమొయిక స్త్రీలకు ? ప్రేలకు వారిముంగటన్.

అగ్రజుని నీవా వంచించునది ?

ధర్మ—(నిలబడుతూ) ఆశ్రమపరివర్తనాలలో అగ్రజుడైననేమి ? అజ రుద్రాది దేవతలైననేమి ? ప్రభువులకందఱూ సమానులే.

విద్యా—నీకీ ప్రభుత్వపీఠం వేసిందెవరు ?

ధర్మ—ఓహో ! కలపుపుల్లలు పుచ్చుకొన్న విద్యానిధులనుకొన్నాం.

(బేతాళ భైరవులు గొలుసులు పట్టుకొనివచ్చి ధర్మరాజుపై కలియబడి బంధించెదరు)

ధర్మ—మీకీసాహసం ఎక్కడిది ?

ఖేతా—కలపుపోటులోనిది.

విద్యా—(కంటితో సంజ్ఞ చేయును)

ఖైర—ఇక్కడిది. (పడివున్న ధర్మరాజును తన్నును)

ధర్మ--తల్లీ! జగజ్జననీ! (పడిపోవును)

(అందఱూ సంకెళ్ళు వేసి తీసికొనిపోదురు)

మోహి—ఇతని క్రౌర్యం శౌర్యం నేటితో మడిగిపోయింది. ఇంకా ధనగర్వంతో మిడిసిపోతున్న బలుని కూడా దుర్బలుని చేయాలి. అప్పటికిగాని సమస్త విశ్వసామ్రాజ్యం చేజిక్కినట్లు గాదు. బలుఁడు కాంబోలు వస్తున్నాడు. (మౌనము)

[బలుఁడు ప్రవేశం]

బలు—నా జగన్మోహినీ! నేఁ డిట్లా కళాకాంతులు తప్పి వున్నావేమి?

మోహి—దయచేయండి. విసవచ్చును.

బలు—(ఆసీనుఁడై) ఏమిటి?

మోహి—మీ అన్న దురాలోచనలు.

బలు—(ఆశ్చర్యంతో) ఏమని?

మోహి—(ఇస్కీ అందిస్తూ) ఇది స్వీకరించండి. [illegible] గాని, బలుని రాజ్యాధికారాపహరణం.

బలు—(ఇస్కీ త్రాగుచూ) వీరి దుర్మదాంధత (గుటకలు వేస్తూ) అంత పనికి దెచ్చునుగా?

మోహి—మీ రది యింకా వినలేదేమోనని చింతిస్తున్నాను.

బలు—(కోపోద్రేకంతో)

ఉ. పేనుకు పెత్తనం బిడిన పిమ్మట నెత్తిని గొర్గినట్లు మీ
తేనితనంబు నేటికి, బరీక్షగ కతుకు నిల్చిగాని ద్రో
హానికి పూనలేదు; బలు, డన్న సదా అడలున్న మీకు వి
ద్యానిధి! గుండెలెక్కడివి? అస్మదఖండ బలమ్ముగాంచవే.

[విద్యానిధి ప్రవేశం]

విద్యా—

ఉ. చాటునఁజేరి ముష్కరులు చాల వచింపఁగ సాహసింతురే
పాటివివేకమద్ది ? ప్రతిభాగతిభాసురమైన సింహమె
చ్చోటనొ గర్జనల్ సలుపుచున్ గదలఁగ బెదరంగఁజొచ్చి, యే
మాటునొ చేరియో పసనికిమాలిన కుక్కలు మొఱ్ఱుకైవడిన్.

అగ్రజుని నీవా దండించేది ?

బలు—(కోపంతో) దుష్టవర్తను డన్నయైననేమి ? సృష్టికర్తయైన నేమి ? దుష్టత్వమున్నప్పుడు శిక్షార్హులే.

విద్యా—నీకీ శిక్షాధికార మెవరిచ్చారు ?

బలు—ఓహో ! తెల్లకాగితాన్ని నల్లకాగితం చేయగల మొనగాళ్లు.

[భేతాళభైరవులు గొలుసులు పట్టుకొనివచ్చి కలియబడి కట్టివేస్తారు]

బలు—మీకీ బలమెక్కడిది ?

భేతా—గల్లాపెట్టిలోది.

విద్యా—(కంటితో సంజ్ఞచేయును)

భైర—(తలపై తన్ని) ఇక్కడిది.

బలు. తల్లీ ! విశ్వమాత ! (పడిపోవును)

(అందఱు కలసి పట్టుకొని పోదురు)

మోహి—ఇప్పటికి నాతంత్రాలన్నీ చాలా జయసూచకంగా కన్పట్టు చున్నై. ఇంకా అఖండకార్యఘటనాధురీణుఁడైన యీవిద్యానిధినికూడా చెఱపెట్టాలి. అప్పుడుగాని నాసిగ ముడిపడదు. ఇతని మధుపానమత్తునిచేసి నాదగ్గఱ మైమఱచి పడివుండే సమయంలో ఇతణ్ణి బంధింపచేయాలి.

ఆవచ్చేదెవరు ? ఓహో ! తిక్కశాస్త్రిగారా ! ఇలాంటప్పుడు సమయం కనిపెట్టి నాదగ్గిరకు వచ్చేటందుకు కారణమేమో తెలుసుకొంటాను.

[తిక్క శాస్త్రి ప్రవేశం]

మోహి— దయచేయండి.

తిక్క— ఇంత తిప్పలుపడి వచ్చినప్పుడు తిన్నగా ముఖసందర్శన భాగ్యమైనా లభించకముందే దయచేయటమేనా ?

మోహి— కాదండి. కూర్చోండి.

తిక్క— అంతేకదా. బ్రతికిపోయినాను. (కూర్చుంటాడు)

మోహి— ఎన్నడూ మాయింటి దరిచూపని పెద్దలు నేటికి ఈదాసురాలిపై అనుగ్రహం కలిగివచ్చారా ?

తిక్క— దయ లేకపోవటమేమిటి ? నిజంగా నీమీదవున్నంత దయ, నా ప్రాణాలపైన కూడా లేదంటే నమ్ము.

మోహి— అయితే ! మీవల్ల మేము తరించేదెప్పుడు ?

తిక్క— ఎప్పుడు పడితే అప్పుడు.

ఉ. పేరిమితోడ నీనయనవీధిని చక్కని ప్రేమసౌధ మిం
పారఁగఁ గట్టుకొంటి; తిరమైమ్మనుకైన మనసదివ్యమైన సం
సారమె; అందు దైవకృప చల్లనివేళ గృహప్రవేశమై
కోరికదీర నా కుసుమకోమలగాత్రి ! సుఖించుచుంటినో.

మోహి— (సిగ్గుతో దూరంగా నిలబడును)

తిక్క— జగదేకసుందరీ ! ఇంతసిగ్గెందుకు ?

చ. నిరతము పాయపాయలయి నీనునుసిగ్గులనిగ్గు లేరులై
వఱదలువట్టె, చుట్టునెటుపాదము మోపుటకైన వీలులే
నిరకముఁజేయునేమొయనను; నిక్కముదానికిమాత్రమేను ని
ధరణినిసై పలేను సురదానవులడ్డినగూడ పొత్తిరో.

మోహ— వేదశాస్త్రపారంగతులయిన మీరు కాముని జయింపలేరా?

గీ. హంసతూలికా శయ్యాలనంటియుండు
దివ్యతరమైన రారాజు దేహబలము
బూదిసేయుచుండిన రుద్రభూమినుండు
మన్మథాంతకుని స్తవమ్మునూనకయ్య.

తిక్క——అది అసాధ్యము.

గీ. నీదుప్రాణికి నాదుప్రాణికిసంగమమ్ము
యీయెడ నెరపిలేక వర్షించుప్రణయ
వృష్టినిత్యముసేయు ప్రవీణుఁడెవఁడొ
మ్రొక్కకొందము చూడుమో ముద్దులాడి.

మోహి——ఏమిటీవెఱ్ఱితనం? ఉత్తమజ్ఞాన సంభూతుఁడవైన నీకిది తగునా? సిగ్గులేదా?

తిక్క——(లేచి) నీవేమన్ననూ నాచెవులకింపుగానే వుంటుంది.

గీ. ప్రేయసీ! నీకిసీయని విసుగుపుట్ట
లేనిదొసఁగులకుంగూడ నేను దాసు
డనయి, నొప్పుకొందునుగాని, వినవె! నాదు
కినుకకీవట్లు దాసివై కినలయొప్పి.

మోహి——(ఆగ్రహంతో, ఛీ! దుర్మార్గుడ! నీముఖం చూడకూడదు (లోనికిపోయి తటాలున తల్పువేయును)

తిక్క——తలుపులావేసేది? గట్టిగానా చెంపలా? (అటు నిటు చూచి చూచి) దీని అంతు కనుక్కోందే పోకూడదు. (మోహిని తెర లోంచి, పోతావా పోవా? బుద్ధి చెప్పించ మన్నావా?)

తిక్క——ఎంతదానవే

సీ. నీ ప్రసూన లతికానిర్మలదేహ మం
దేమిగలదో సాధ్య మెపుడు గావు
నీ నిగారపు హరిణేక్షణాశూల మం
దేవిసమంటునో గసోద్భవుంటి
నీ కులుకుతళుకుల నీచిర్నగవు లగ
టాలలోగా లేమొ తేలకుంటి
నీ పలుకు మందాకినీస్రవంతిలో సుడి
గుండములేవో మునుగలను తాళ
గీ. లేక యుక్కిరిబిక్కిరై సోకల బలి
యాచునుంటినే ! నామీద యాశలేశ
మైన లేదని మొదటనే గానకుంటి
మర్మమున వన్నెలాడివే మాయలాడి.

ఇంకముందు నీగుమ్మం తొక్కవచ్చునా ? కసాయి దుకాణం దగ్గఱ కాకులూ కుక్కలూ ముసరినట్లు నీ దుకాణందగ్గఱ కామోద్రేకులు ముసురుతారు. కసాయివాండెన్నిసార్లు కొట్టినసూసరే; రుచిమరిగి తిరిగివస్తున్న కాకులూ, కుక్కలూమాదిరి నీవద్దకు విటులు వస్తుంటారు. (చూచి) అయితే; యిక్కడ రుచిమరిగిన పురుగులేవో వస్తున్నట్లున్నది.

ఇది ప్రాణప్రమాదమైన ఘట్టమేనే. కానిమ్ము. (పై కొల్లాయి గుడ్డని జోలె చేసుకొని) సీతారామచంద్రపరబ్రహ్మణేనమః. అమ్మా! ఉపాదానబ్రాహ్మణ్ణి. ఇవాళ్ల దశమీ శుక్రవారం వర్జంలేదు.

[భేతాళ భైరవులు ప్రవేశింతురు]

భేతా—(పెద్దగా) ఎవడవురా నీవు ?

తిక్క—(ఉలిక్కిపడును)

భైర—ఎందుకల్లా వులిక్కిపడి దొంగచూపులు చూస్తావ్ ?

తిక్క—ఉపాదానం అడుగుతున్నా బ్రాహ్మణ్ణిబాబు.

భేతా—ఇదివుపాదానం పెట్టే గుమ్మంకాదుపో.

తిక్క—చిత్తం. అల్లాగే (మెల్లమెల్లగాబోతూ కాలుజారి పడినట్లు నటించి మాటలు వింటూవుంటాడు)

భేతా—ఇంకా విద్యానిధి భరతంపట్టాలి. తిరువాత భరతసామ్రాజ్యమునకెల్లా మనం పట్టంకట్టుకోవాలి.

(తిక్కశాస్త్రి చెవులు మూసుకొని శ్రీహరీ శ్రీహరీ అనును)

భైర—అదేమిటి ఇక్కడ బాధపడుతావ్. పొమ్మంటేను.

తిక్క—పోతున్నా బాబు! మావాళ్ళందరికీ పోయేకాలం వచ్చింది కానీ నాకుమట్టుకు గావటంలేదు అంగ్రిణి పోతున్నా కోప్పడక.

(నిష్క్రమించు)

భైర—ఏమిటో పిచ్చివాడులే. అయితే నీవిప్పుడు చెప్పిందికూడా మన తల్లి సలహాతీసుకొని చేద్దాం.

[మోహిని ప్రవేశం]

మోహి—నా బిడ్డలారా! ఆవదరు బోతెక్కడ?

భేతా—వదరు బోతెవరు?

మోహి—పేద బ్రాహ్మణుడు.

భేతా—నిన్నేమైనా అన్నాడా? చెప్పు. ఈడ్చుకొస్తాను.

మోహి—పిచ్చివాడల్లే వున్నాడు. వాడి జోలెందుగ్గానీ విద్యానిధి యేడీ?

భేతా—కోట దగ్గఱున్న సైన్యాల్ని చుట్టుపట్లకి పంపించటానికి పోయాడు. ఇప్పుడే వస్తాడు.

మోహి—మంచి అదును దొరికినది. విద్యానిధి వచ్చిన తక్షణమే మాలిమి చేసుకొని మధుపాన మత్తుణ్ణి చేస్తాను. వానిని గూడా

వెంటనే బంధించి, పిమ్మట, కోటలో ప్రవేశించి, భగవన్మూర్తిను, జనకుణ్ణి శూరుణ్ణి, రాజ్ఞాన్ని బంధించి చెరసాలలో పెట్టి భరతరాజ్యలక్ష్మిని మీరారు పెట్టబెట్టారండి. అప్పుడు నా కళ్లు చల్లారుతై.

భేతా——మా సంకల్పం కూడా సంపన్నమే. (చూచి) విద్యానిధి వస్తున్నాడు (మౌనము) దయచేయండి.

[విద్యానిధి ప్రవేశం]

విద్యా——మిగతా మిగిలినవారిని పట్టుట బహుసులభం. కోటవద్దనే సైన్యాల్ని ఇంకో చోటికి పంపించటమైంది.

భేతా——సకలసద్గుణనిధీ ! విద్యానిధీ !

మ. సుముహూర్తంబునుజూచి సర్వసకలసు శోభిల్లగాంచిసి, భూ
రమణుల్ కానుకలంప, యీభారతసామ్రాజ్యంబు నీకంది, ప
ట్టముంగట్టించుచు మామనోరథము వేడ్కన్ వేగ నీడేరగాం
చమె; నీకోమల పాదసన్నిధిని సుశ్రాంతంబు విశ్రాంతియున్.

విద్యా——ఆనందసునామధేయా !

ఉ. ఎమ్మెయింతమ్ముల్లొంటిసయి నీగినువాలంగనీయసన్న భూ
వమ్మునగాచు నగ్రజుని వంచనచేయంగడంగినట్టి, యీ
తమ్ములు నాకేల ? శపథమ్ముగ నన్నుతరించు దూరదే
శమ్ములవారు మీరలె నిజమ్ముగ తమ్ములు నమ్ముమీ సుధీ.

భేతా——మేమూ ఆమాదిరిగానే త్రికరణశుద్ధిగా భావిస్తున్నాం కొంచెం సేపు తమరిచ్చటే విశ్రాంతి తీసుకోండి. తదుపరి భావికర్తవ్యం ఆలోచిద్దాం. మేమిప్పుడేవస్తాం.

విద్యా——మంచిది. వెళ్ళిరండిబాబు (భేతాళభైరవులు నిష్క్రమింతురు)

మోహి——ఈ మాయదారిగొడవలో చాలా బడలిక పడ్డారు.

విద్యా — నాకు బడలికేమిగాని, పాపం మీ ఆనందానికి మీ సత్యానికి బడలిక రావచ్చు. చాలా కష్టపడ్డారు.

మోహి. వాళ్లు పుట్టి పెరుగుతున్నది మొదణ్ణుంచీ, ఒడుదుడుకైన కాపురాల్లోనే వాళ్ళకి బడలికేమిల్లెండి.

విద్యా — మీరు సాధుజనవంశీయులు కనుక కష్టాలు చెప్పుకోరు

ఉ. కానఁగ నింక ఈభరతఖండమునల్ల మదీయ బాహువులన్
దీసదయాసముద్రములయి నీసుతులందఱు మోపుచుండిరీ
లోన ముదమ్ముగా రసికలోకము నిన్ గొనియాడునట్లు వి
ద్యానిధినీకరంబులకు దక్కెనె! నాభువనైకమోహినీ.

మోహి — ఇప్పటికి ధన్యురాల్ని అయినాను. (ఇస్కీయిస్తూ) కొంచెమిది స్వీకరించండి. బడలిక తీరుతుంది.

విద్యా — (ఇస్కీ త్రాగి) నాజగదేకసుందరీ! నీకన్న నాకు పంచప్రాణాలూ తీసిగాస్తు యి[illegible] తీసిగావు. అనుపమానమైన నీ కోమలకమనీయకరుణాకటాక్షమే నాకష్టైశ్వరము.

సీ. తళుక్కుబెళుక్కులఁ జూపి పుల్కరింపుచు మేను
పల్కరించి మనస్సు కల్కబెట్టు
కులుక్కుకల్కెము వంటఁ జిల్కరింపుచు, గుండె
గొంతుకలోన చేగింతు మంట
తలపుతెరలనుండి వలపురసము పిండి
అన్నహితముగూడ మన్నుసేయు
పిలుపు సంజీవితో బలుపుఁ దెప్పింపుచు
భయనిశీథిని పట్టపవలుసేయు
సిగులాబితెబ్బలిక బాగోగులెంచ
కాలుబిడ్డల నాగంగ పాలుసేయు

కలికి! నీపాదసన్నిధి మెలఁగినప్పుడు
కష్టములు కనపడవేమి కారణంబు॥.

మోహి—ఇహ విశ్రాంతి పుచ్చుకొండి.

[విద్యానిధి పరుండును, మోహిని పాదసేవజేయు, విద్యానిధి మత్తువచ్చి స్పృహతప్పి వుండును]

భేతాళభైరవులు వచ్చి బంధించి తీసుకొనిపోదురు

మోహి—ఇంక సమస్త భరత సామ్రాజ్యం చేజిక్కినది. ఇహ నా కుమారులను భరతసామ్రాజ్యపట్టాభిషిక్తుల్ని చేయాలి. మిగిలిన వారిని అవలీలగా జయించవచ్చు.

(నిష్క్రమించు) (తెరపడు)

2వ రంగం

అంతఃపురం

[రాజ్యలక్ష్మి విలపించుచుండును]

రాజ్య—అపారసంసారదుఃఖాటవిలో కేవలం ఒక్క బక్క-చిక్కిన పేదవారలేకాదు చిక్కువడినది.

ఉ. అక్షులచే నదీనదములన్నియు నాపఁగలట్టి ఆసహా
ప్రాజ్ఞుఁడు చొర్వలేని గహనాంతరభూముల కేలికైన హా
ర్యక్షము వేటగాని వలయందగచాట్లకు చిక్కినట్లు నేఁ
డీక్షితినాథులెల్ల హరిణేక్షణకొక్కతె కౌరచిక్కరే.

నన్నుతక్క అన్యుల్ని కలలోనైన కన్నెత్తి చూడమని శపథం చేసిన నానాథులెంతపనికి పాల్పడ్డారో చూడండి.

[శూరుఁడు ప్రవేశం]

శూరు—

గీ. అన్యకాంతకు నాదు పెద్దన్న లెల్ల
పాదదాసులై రాజ్యసంపదలనెల్ల
పాడుసేయుచున్నారన్న నాఁడు నీవు
చెవిని నిడితివే రాజ్యలక్ష్మిలలామ.

నేఁడైన నమ్మ తెలుసుకొంటివా? దాసీగడప తొక్కి నష్టపుచ్చిన అన్నలు ఏతీరపాలగా మారారో చూచేవా.

ఉ. కంటికి తెప్పలై తుదకు కాలికి త్రోవకు చెప్పులై కృపన్
మింటను గొడ్గులై కడుపు నింపెడి క్షేమమునుగన్న నారలై
పంటవలంతిగా భరతవర్షము నోసంగినట్టి యీ
యింటిలో తల్లిదండ్రులను నేడుస నొచ్చిరి నష్టచిత్తులై.

రాజ్య—మీరు చెప్పినా వినకున్న మీ తల్లిదండ్రులు చెప్పి చూచినను వినకుందురా?

[రత్నం ప్రవేశం]

రత్నం—అన్నలు కారు అహంకారులు.

ఉ. పిన్నలు మీరటంచు గణియించి గణించక మమ్ము నింటి పె
ద్దన్నలు సూచి, మూలఁగల యూడది గూడ తెగించి, మీకు పె
ద్దన్నలటంచుఁ బల్కి తుద కానడమంత్రపువారిచేత పె
ద్దన్నలు కీలుబొమ్మలయినారిఁక యేమ్మొగమ్ము పెట్టినా?

శూరు—తమ్ముడా! కార్మికరత్నమా! నీవు చెప్పిందంతా వాస్తవం.

రత్నం—అన్నా! శూరాగ్రేసరా! నాకేటిపాటుదోరా!

మ. శ్రమకెంతో చెమటోడ్చి, మొక్కుబడులశ్రాంతంబు నీడేర్చి,
రమణుల్ మూపున మోపఁబడ్డ ధరణీరాజ్యంబు పూల్ పల్లకీ

సమమున్ జేసెడి కష్టజీవులకు విస్పష్టంబుగా నింక గా
జ్యములో సౌఖ్యములేని దుర్గతిని సంస్థాపించుటే యున్నతే.

శూరు—తమ్ముడా! అన్నలు ఇంత దుర్దశ తెచ్చిపెట్టినట్లైతే.

మ. ఇదిగో! భూధవులన్ ధనాధిపతులన్ హిందూ మహాలక్ష్ములన్
పదిలంబౌగతిపై డినెడలసయిన్ పాదంబులెత్తించు బ
ల్మిది. బల్ కల్మిది, నాహలాయుధము; బల్మిన్ భూమినిద్దానిచే
కుదళింతున్ విదళింతు దుర్దశలకున్ ఘోషించు భూవల్లభుల్.

[భరతమాత జనకుడు ప్రవేశింతురు]

భరత—నాచిన్నారితనయులారా!

[ఆదుర్దాతో తిక్కశాస్త్రి ప్రవేశం]

తిక్క—(ఆదుర్దాగా) అయ్యా! జనకమహారాజా! ప్రళయము ప్రళయము.

జనకు—ఏమది? (అందఱు నిలబడి చూతురు)

(తిక్కశాస్త్రి దుఃఖముతో వుంటాడు)

జనకు—అయ్యా! కవిసార్వభౌమా! దుఃఖపడెద రెందుకు?

తిక్క—కుమారులు బంధింపబడ్డారు.

భరత—నాతండ్రులారా (పడిపోవును.)

రాజ్య—మామా (పడిపోవును.)

[శూరుడు, రత్నము, భరతమాత దగ్గరకూర్చుందురు]

జనకు—(రాజ్యలక్ష్మివద్దకు వచ్చి) అమ్మా భారతిరాజ్యలక్ష్మీ! భయము లేదు. అయ్యా! కవిసార్వభౌమా ఏదుష్టులచేతులలో బంధింపబడ్డారు.

తిక్క—పరదేశ వర్తకులచేతిలో.

జనకు—మాబిడ్డలారా!

శూరుడు—నాయన్నలారా!

తిక్క—ఎంత స్త్రీనందనమైన విశాలభారతదేశకుటుంబానికి కష్టకాలం దాపరించారా?

శూరుడు—రత్నమా నీవు యుద్ధసన్నద్ధవై యుండుము. నేనిప్పుడే సర్వసైన్యాల్ని సిద్ధంచేసి వస్తాను. (నిష్క్రమించు)

తిక్క—ఔరా! విశ్వాసఘాతకులారా;

ఉ. దిక్కెటులేకపోక బ్రతుకంగ విరుద్ధులు సర్వవేషధారులై
ఇక్కడ కాలుమోపుటకు నేలగీలగవచ్చి సేవకులై
మొక్కనుబోని యీభరతపుత్రులమాయన నేటికౌర, మీ
టక్కరినక్కజిత్తులకటా ప్రకటించిరె యన్నయింటిలో. అకటకటా.

సీ. చల్లనినీదుసంసార సాగరనౌక
నీతిమింగిలజాతి యెప్పుడుకనియె?
పచ్చని నీకుటుంబపు కల్పవృక్షమ్ము
నీచేరుపురుగుల వెప్పుసూచె
చేవగలట్టి నీసిరిలోగిటి మకరం
బులకీ చెదలుపుట్టిపుడిలపట్టె?
ముద్దులుగుల్కు నీయద్దాలమేడపై
నీచిచ్చులనీడుగు లెప్పుడురాలె?

గీ. నేడునీయుసమాన నిర్నిద్రశౌర్య
ధైర్యసింహపరాక్రమధుర్యులైన
తనయులందఱు పిఱికిసందలయి, పట్టు
బడిరె! చెడుగులచేతిలో భరతమాత.

రత్న—(కోపంతో) ఏమంటివి.

చ. చెడుగులు పన్నుపన్నుగడ జీవితమంచెపు డెంచనట్టి పే
ర్పడియు సమాయకత్వమున భారతవీరులు ధీరులౌదురే

గడుసులుగాంచిన నివురుగప్పిన గొప్పప్రతాపవహ్నినిన్
పడగలనెత్తమో సిరికిసందల నహాదుము చూతువి త్వరిత.

[శూరుని ప్రవేశము]

శూరు—రత్నమా! భగవత్సామ్రాజ్యాని కేమి తెలిసినది.

రత్న—ఏమదీ

జనకు—అదేమిటి,

శూరు—సైనికశిబిరములో సైనికులెవ్వరూ లేరు, ఆయుధసామగ్రియూ లేదు.

తిక్క—సైన్యాల్ని కూడా స్వాధీనం చేసుకొన్నారా? అయితే ప్రళయమే!

జనకు—ప్రళయమూ లేదు గిళయమూ లేదు. నమ్మకస్తులైనవారు మీరు.

రత్న—కోటకూడా ముట్టడించటానికి ప్రయత్నిస్తున్నారేమో. మనం కూడా సిద్ధం కావాలి.

(ఫిరంగిమ్రోత వినబడును)

తిక్క—(ఉలిక్కిపడి ముందుకు నడచును)

శూరుడు—(తిక్కశాస్త్రిని లేవతీసి) మీకు వచ్చిన భయం లేదు. భయపడకండి.

జనకు—నలువంకల చూచును.

తిక్క—(వణకుచు) మా యింటిదగ్గర సమాచారం ఎట్లా ఉందో చూచొస్తా. (పోబోగా తిరిగి ఫిరంగి మ్రోగును. తిక్కశాస్త్రి ఉలిక్కిపడి అమ్మో అని వెనుకకు వచ్చును)

జన—బిడ్డలారా భయపడకండి వీరిని పంపించి ప్రభంజనుడు దంశధ్వజుడు ఎక్కడున్నారో జాడ తెలుసుకొని తీసుకొనివస్తాను. మీరు

మీతల్లిదగ్గరా రాజ్యలక్ష్మిదగ్గరా బహుజాగ్రత్తగా ఉండండి.
రండి తిక్కశాస్త్రిగారు!

తిక్క—ముందు మీరు త్రోవతీయండి బాబు (నిష్క్రమింతురు)

(రత్నం భరతమాతదగ్గర శూరుడు రాజ్యలక్ష్మిదగ్గర కూర్చుంటారు)

రత్న—తల్లీ దుఃఖించకు

భరత—నాతండ్రీ ఆభయంకర దారిద్ర్య పిశాచి చేసిపోయిన ప్రతిజ్ఞ
చెల్లించుకోంటానికి నాగుమ్మం యిటుగా త్రొక్కి నదాసమిరా

రత్న—తల్లీ అట్లున్న టికి తలంచవద్దు.

ఉ. నీకడగొట్టుబిడ్డడిల నీవిడుచల్లనికూర్మిదీవెనల్
సోకి, విశాలభారతయశోలతికా, కమలాంగు తాత్మీనిక
వ్యాకులమున్న లేని తనవజ్రపుటెక్కలపై సనిల్పి, ను
శ్లోకుడటంచు దల్పబడి చొర్వగనిచ్చునె తామ దేవతన్.

రాజ్య—అత్తా భరతమాత వెనకవచ్చిన నున్న వన్న పిశాచపు బలమేనా
ఇది?

శూరు—దేవీ! భారతసామ్రాజ్యలక్ష్మీ! నీవట్లాఎన్నటికి శంకించి
చింతించవద్దు.

గీ. ఈసమస్తజీవులకెల్ల గ్రాసవాస
ములనొసగికాచుచుండెడి బలిమిగల, హ
లాయుధుడు భారతీయుడు శ్రీయుతుండు
పీడకలజేసి రాజ్యమ్ము విడచునేమి?

(ఫిరంగి మ్రోగును)

రత్న—అన్నా! ఆశతఘ్నిమ్రోత యెక్కడ?

శూరు—తమ్ముడా! జాగ్రత్త. శత్రువులు కోటముట్టడిస్తున్నట్లున్నారు.

భరత—నాతండ్రులారా! మీతండ్రి ఇంకను రాకపోయెనే?

రత్న—రాగలదు భయపడకతల్లీ. (చూచి) అన్నా, అనుష్ఠానపరుడు లోపలికొస్తున్నాడు (లేపబోగా తల్లిపట్టుకొనును)

శూరు— (లేచి) ఓరీ దుర్మదాంధ నిలువక్కడ. (పోబోగా రాజ్యలక్ష్మి పట్టుకొనును)

[భేతాళ భైరవులు ప్రవేశింతురు]

భేతా—(నవ్వి) పెద్దన్నల బలాబలములేవో బట్టబయలయినవి. ఇంక మీసరుకుకాస్తా మిగిలింది.

రత్నం—నాలిముచ్చుసన్న్యాలు కట్టేస్తు.

భైర—కట్టిపెట్టటానికే వచ్చింది.

శూరు—ఈతంబళ్లమొగాలేనా కట్టవచ్చేది.

భేతా—ఇంతకుముందు ఏ మంగిళ్లప్రదక్షిణ మొగాలు బంధికానలో పడ్డవి?

రత్నం—మాకుండటానికి వంచనిచ్చి బతకటానికి శాశ్వతజీవనోపాధి జూపించినవదాన్యులు.

భైర—ఏ మహావీరులవల్ల?

శూరు—తిన్నయింటి వాసాలు లెక్కబెట్టిన వీరులవల్ల.

భేతా—(నవ్వి) సీ. ఓహూ! మీఘనధైర్య సాహసదీపిక
జూచి, మీమొగములు సూపుడింత?

రత్న— ఆహాహా; మాధైర్యసాహసలక్ష్మినిన్ గాంచ
కనులున్నవో మీకు కనులులేవా!

భేతా— ఔర! మీతెల్వులు పారలేవిపుడింత
వదరక మాకాళ్లు పట్టుడింక

శూరు— మీమేకపోతుగాంభీర్యముసాగదు
ప్రేలక, నోర్కట్టి పెట్టుడింక

భేతా—— ఏమి! మీ ధైర్యమే మెచ్చుటగనలేదు
బహుమానమిత్తుము పట్టుడింక

రత్నం—— తమరిప్పటి కవమానమును ముట్టకమున్నె
వచ్చినదారిని పట్టుడింక

భేతా—— ఎన్ని చెప్పిన వినకున్నమాత్రమె మీకు
తప్పునా తుదకు మా దండనీతి?

శూరు—— ఎంతిమర్యాద మే మిపుడు కాపాడిన
మీబుద్ధికింక యీ మేదినిపయి

రత్నం—— గీ. మమ్ముఁ బోలినపిన్నలు తమ్ములిడెడి
తగినశాస్తి కావలెనేమొ బిగువువదల

భేతా—— మీరిమాట్లాడుకుడి, మిమ్ము బ్రింగివైతు

శూరు—— వ లిలే... ...పొట్టుఁజీలు చెడుగ.

భేతా——సైనికులారా! ...(రత్నం శూరుడు నిలిచి చూచుచుండ సైనికులు చుట్టుముట్టడివేసి బంధించుచుందురు)

భరత——(దుఃఖమున) నాబిడ్డలారా! మీతల్లికి దిక్కెవరురా? (లేచి దగ్గరకు వచ్చును)

భేతా——(బిగ్గరగా) నీకు దిక్కా? మున్ను నీచేత వెడలగొట్టబడిన దరిద్రదేవత (కాలితో తన్ని పడద్రోయును)

భరత——నాతంద్రులారా! ఎంతదురవస్థ పట్టెరా.

[బంధించబడిన శూరుని, రత్నమును తీసుకొని పోవుచుండగా రాజ్యలక్ష్మి వెంట నంటుచూ]

రాజ్య——(దుఃఖమున) నాప్రాణనాథులారా! ఈభారతరాజ్యలక్ష్మికి దిక్కెవరు?

భేతా—ప్రచండశపథము చెల్లించుకొన్నయుగంభేతాళుఁడే. (దగ్గరకువచ్చు)

రాజ్య—(కోపముగా) ఛీ! దుష్టుఁడా దూరముగా నిలబడు.

భేతా—దూరముగా నిలిచెద, తమ్ముఁడా! భైరవా! దానిజుట్టుపట్టి
యీడ్చుకొనిరా!

రాజ్య—(భయకంపితగాత్రయై) దైవమా!

కీర్తన

నిగమశాస్త్రనేతలారా!
నిజాచారఘనముసీంద్రులారా!
ఓమహాత్ములారా!
ప్రజలు దురాత్ములు మాస్వారాజ్యధనలక్ష్మి
బట్టి యీడ్చుచుండిరి ॥ని॥

భైర—(దూతుడుగావచ్చి జుట్టుపట్టుకొని లాగి) కదలు గయ్యాళిగాడిదా.

రాజ్య—(దుఃఖమున) అత్తా! భరతమాతా! పురుష సింహములగు నీకుమారులేరి? మామా! జనకరాజసార్వభౌమ! నీకుమారుల బలపరాక్రమము లడుగంటెనా? (నిష్క్రమింతురు)

[భరతమాత అక్కడ పడియుండును. ఆభయంకర గేహమున
విషాదధ్వనులతో ప్రక్కవాద్యములు మారు
మ్రోగుచుండవలెను]

భర—సాటిలేని నారత్నగర్భము దుర్భర శోకాగ్నిగుండము జేసితివా? లోకరక్షకా! అనుపమాన నవరత్న దేదీప్యమానమగు ఈభరత సామ్రాజ్యకోట కూల్చి పాడుపడ్డ కొంపచేసితివా? మహానుభావా! అసమానమేధాసంపన్నులగు విద్యానిధులారా! మిమ్ము గన్న యీభారతమాతజనని యీనిరంకుశ భేతాళభూపాలకుల కమ్ముకొంటిరా! అనివార్య శౌర్యధుర్యులైన పురుషసింహము

లారా! భరతవంశ సత్క్షత్రియులారా! ఈ మీకన్నతల్లిని కటికవాండ్రకొప్పజెప్పితిరా! అతులిత వజ్ర వైడూర్యమణి హార్మ్యములలో! ముద్దుముచ్చటలతో కాపురములుసేయు నా ధనఘనులైన కుమారులారా! మిమ్ముగన్నతల్లి కడగండ్లు కనుపించుటలేదా?

గీ. నాదునాగేటి సాటుదారా! దురంత
కష్టజీవి సహోదరా! కడను నీవు
కూలితమ్ముని తోపాటు కూలిపోగ
భరతమాత నీభేతాళ వ్రాత కిడెగె.

(పడిపోవును)

[జనకుడు ప్రవేశము]

జనకు—(ఆశ్చర్యముతో) ఏమిది! నాబిడ్డలేరి (దుఃఖమున) ఈ నెత్తుటిబిందువులెచ్చటివి (భరతమాతవద్దకు వచ్చి) తనయ యెక్కడ? రాజ్యలక్ష్మి యెక్కడ? (దుఃఖమున) నీవు కూడా నన్నొక్కనిజేసిపోతివా? భరతమాతా! అష్టైశ్వర్యవంతురాలవై వీరాభిమన్యుల విశ్వదాతలను కని! తుదకు అష్టకష్టములకు లోనయి నన్ను మందభాగ్యుని చేసి పోతివా? విశ్వవిఖ్యాతి గడించిన సుతనయులు నీవు నాకంటికి కంటివై సచో నాకీప్రపంచపుజోలియేల?

సీ. నీకన్న నోర్పు కన్పించు భారతమాత
భూదేవి! మిడసిపోబోక నీవు
నీకంటె సుగుణమణియె; నాభరతరాజ్య
లక్ష్మి ప్రకృతికాంత లగ్గుపడక
నీకన్నచల్లని నృపతులే భరత ప్ర
భులు సుధాంశుడ! పైన కులకకీవు

నీకంటె బహుతేజ సీయులే భారతీ
యులు, సహస్రాక్షునా యుబ్బిపోక

గీ. దశదిశాంతశుద్ధాంతసా మాన్యసీ, ల
తాంతముల వన్నె కెక్కించు నన్నగీయు
భారతీయ నృపాలకత్వములు పిదప
తమవెలుంగు లన్నియెందుకు చమురుచేటు.

(తెర పడును)

3 వ రంగం

[1 వ ఖైదు విద్యానిధి మాసిన గడ్డములో పిచ్చిదానివలె నుండును]

విద్యా—ఎంతఘోరము, ఎంతవిశ్వాస ఘాతిత్వము. సకలవిద్యా శేముషీధురంధరుడనై నానల్గురి సోదరులను [illegible] విజయుడనై భరతఖండము పరిపాలించుచున్న నేను, మసే భము మాదిరి యీనాడు కుటిలులు త్రవ్వినగోతిలో బడితిని

(వార్డరు తిరిగిపోవును)

2 వ ఖైదు ధర్మరాజు మాసినగడ్డములో పిచ్చివాడై యుండును.

ధర్మ—ఎంతనమ్మించిన స్వామిద్రోహము. ఎటువంటి కపటనాటక సూత్రధారులు అఖండభరతరాజ్య పరిపాలనాదక్షుడనై, ధర్మ రాజనని పిలువబడి తుదకు మదించిన వృషభముమాదిరి యింగిడిగడ్డిమేసి క్రూరులచేతిలో గిలగిల తన్నుకొనిచావ వలసివచ్చినది. (వార్డరు తిరిగిపోవును)

3 వ ఖైదు బలుడు మాసినగడ్డములో పిచ్చివాడై యుండును.

బలుడు—ఎంత దురాగతము. ఎంత మాయవేషధారులు. అనంత కోటి ధనాగారములపై పడగలెత్తించి భరతసామ్రాజ్యము

నిదేమట్లనుకు మీకడగొట్టుబిడ్డడు యీభౌతికదేహమును విడిచి పెట్టెను. (భరతమాత, జనకుడు కనిపింతురు) లేచి నన్నుగన్న తలిదండ్రులారా! నమస్కారములు (గిరివించి అదృశ్యులగు మరు) మీఆపార్గమైన పుత్రవాత్సల్యము కడుపారబిడ్డలగన్న తలిదండ్రులకే తెలుసు.

(వార్దరు తిరిగి పోవును)

4 వ రంగం

[భేతాళ సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము ఏనుగుంబారీల్పై భేతాళుడు భైరవుడు కూర్చుందురు. అశ్వారూఢులు ముందు నడుచు చుందురు. సైనికులు కదముత్రొక్కుచూ నడుచుచుందురు. బ్యాండు మేళములు వాయించుచుందురు. ఫిరంగులు ప్రేల్తురు. భేతాళమహారాజు గారికి జయ్‌జయ శబ్దములు మిన్నుముట్టుచుండును.]

[తిక్కశాస్త్రిముక్కుపై చేయిపెట్టుకొని ప్రవేశము.]

తిక్క——ఎంత కష్టకాలమువచ్చినా భారతసామ్రాట్టులు పదభ్రష్టులై దుష్టరాజులు గజారోహులై నడిపించుటగా నూరేగుటను జూచిరి? నాకడుపుపగిలి వచ్చుచున్న దుఃఖాగ్నిజ్వాలలు ఈ నిరంకుశ భేతాళప్రభుత్వ భవనముల నెన్నడు మారణముసేయునో అప్పుడే నేను కన్నుమూతును. (నిష్క్రమించును)

[ప్రభంజనుడు దండధరుడు ప్రవేశము]

ప్రభం——దండధరా! ఎన్నడు తిరిగి మన భారతదేశ చక్రవర్తుల జూతుము.

దండ——ఇంకా చూచుట దుర్ఘటము. ఈభేతాళ శక్తిని డీకొను వారెవరు?

ప్రభం—నిజమే! వీనిబలము ఆత్రిమూర్తులకు గూడ అలవిగానిది.

దండ—వీనికొలువులో సేవకావృత్తికంటె, ఆకులు, అలములు నట్టడవిలో తిని బ్రతుకుటె ఉత్తమము.

ప్రభం—ఇంత వూపిరి పీల్చుకొనుటకైనా వీని ఆజ్ఞ కావలసి వచ్చుచున్నది.

దండ—అడవిలో మేతగూడా మేయుటకు అటకాయించునేమోగా;

ప్రభం—చూడగా చూడగా అంతే అగునేమో. పద. ఆలస్యమైతే కొంప మునుగుతుంది.

(నిష్క్రమింతురు)

(తెరపడును)

5 వ రంగం

[భేతాళ ప్రభుత్వభవనము. భేతాళుడు ఆసీనుడై యుండును. సేవకులు, దండధరుడు, ప్రభంజనుడు ఇరుప్రక్కల నిలిచి నమస్కరించుచుందురు]

[మోహినీ ప్రవేశము]

మోహి—కుమారా! భేతాళా! ఈ భారతదేశ ప్రభుత్వపీఠము నీ వధిష్ఠించితివి. నీక్రిందనున్న ఉద్యోగస్థులుగా మనదేశీయుల నియమించినను యింతవైశాల్యముగల దేశములో కప్పము రాబట్టుకొనుట కష్టతరము.

భేతా—నిజమే! ఇప్పటికి శిస్తులు వసూలు కాలేదు.

మోహి—అందుకని విద్యానిధిని మన మంత్రిగాను, ధర్మరాజును సామంత రాజుగాను, బలుని షరాబుగాను, నియమించుకొన్నచో, సులభముగా శిస్తులు వసూలగు కావచ్చును. వారిని మట్టుకు తత్క్షణమే బంధవిముక్తుల జేయుము.

భేతా.... ఈసలహా అన్నివిధముల బాగుగానున్నది. ప్రభంజనా!

ప్రభంజ — ప్రభూ!

భేతా — నీవిప్పుడుపోయి కారాగారములోనున్న విద్యానిధిని, ధర్మరాజును, బంధవిముక్తులగావించి నాదగ్గరకు తీసుకొనిరమ్ము.

ప్రభం. చిత్తం. (నిష్క్రమించును)

మోహి — భేతాళా! ఇక్కడమతము మాపి మనమతము స్థాపించవలెను. ఇక్కడివిద్య చెరిపి మనవిద్య నాటవలెను. ఇక్కడి నాగరికత నేలగలిపి మననాగరికత నెలకొల్పవలెను. ఇదిగో మన [illegible]. [illegible] నిల్పుకొను కొనును.

భేతా — తల్లీ! నీవు చెప్పినది రాజనీతి.

మ. సకలైశ్వర్యబలోన్నతోన్నతములు [illegible]
యకులాధత్యులు కార్యదక్షులు [illegible]
భ్రుకుటీమధ్య[illegible] వరేణ్ణ ఇక్కడే
యికభేతాళుని [illegible] బుద్ధిమత్తను [illegible]

మోహి — పుట్టలేదు. పుట్టబోదు. పుట్టరు. కాని మనమిచ్చట ఏటికెదురుగా ప్రవేశించి జయించగలిగినాము. [illegible] మరువగూడదు. యిక్కడ వీరిలో వీరికెప్పటికప్పుడు ఏవిధముగానైనా నానకే మిత్రభేదము పుట్టించుచుండిన కాని మనమిచ్చట నిలువలేము. ఆచాతుర్యమే మనకు ప్రాణరక్ష.

భేతా — యదార్థము.

[విద్యానిధి ధర్మరాజు బలుడువచ్చి భేతాళునకు నమస్కరించి నిలబడెదరు. దండధరప్రభంజనులు ఇరువంకల నిలుతురు.]

భేతా — నీ ధర్మబుద్ధికి నీవినయవిధేయతకు మెచ్చి మిమ్ము విడిపించినాను. విద్యానిధీ!

విద్యా——ప్రభూ !

భేతా——నీవీ నిమిషమునుంచి నా ప్రభుత్వములో ప్రజలందరికి నా మతము,నావిద్య నా నాగరికత నేర్పించుటకు మంత్రిగానుండుము.

విద్యా——చిత్తం.

భేతా——ధర్మరాజా !

ధర్మ——ప్రభూ !

భేతా——నీవు నేటినుండి నా ప్రభుత్వములో కొన్ని పరగణాలకు సామంత రాజువై ప్రజలవద్ద శిస్తు వసూలుచేసి రెండువంతులు మాకు పంపుచు నాచెప్పుచేతలకు లోబడియుండుము.

ధర్మ——చిత్తము.

భేతా——బలుడా.

బలు——ప్రభూ !

భేతా——నీవు నేటినుంచి మా దేశపు వస్తువులను చెప్పించి యిక్కడ వ్యాపారమును [illegible] అవసరము వచ్చినప్పుడెల్ల మా ప్రభుత్వపు కోశాగారములకు డబ్బు పెట్టుబడి పెట్టుచుండుము.

భటు——చిత్తము.

భేతా——దండధరా ?

దండ——ప్రభూ,

భేతా——మిగిలినవారందరు రత్నము పోగరుసోతులు. వారినీతక్షణమే ఆజన్మాంతము ద్వీపాంతరవాసశిక్ష అనుభవించునట్లు నట్టనడి సముద్రముమధ్య ద్వీపములో విడిచిపెట్టిరండు. ప్రభంజనా ! నీవీముగ్గురిని నీవిప్పుడు చెప్పినపనులకు పంపుము.

ప్రభం——చిత్తం. రండిబాబు, (అందరు నమస్కరించి పోవుదురు)

భేతా—— తల్లీ ! నాతమ్ముని భైరవుని సర్వసైన్యాధిపతిగా నియమింతును.



# విశ్వస్వారాజ్యము

## పంచమాంకము

### 1వ రంగము

భోజనాలగృహము.

[ఆచరణములన్నిటిని తీసివేసి నూసినచీరతో
దుఃఖపరవశయై రాజ్యలక్ష్మి యుండును]

రాజ్య—ప్రాణనాథుల విడనాడి పాపిష్ఠిజీవితము గడుపుగొనుచున్న నావంటి మొండిదాని మ్రోతువు, ఓ భూదేవీ! నీకు భారముకాదా! ఏల నన్ను మోసెదవు. ఏనడిసముద్రములో నయినను పడద్రోయుము. నీకు భారము తప్పును! నాకు విచారము తప్పును.

సీ. దుమికి బ్రహ్మాండంబు దూసికట్టింపగలజేయు
దరికడలి కెరటాల్ త్రగ్గబట్టి
కప్పించి గుండెలు కరగించు గిరికోట
తేల్కగా గంటన తేలబట్టి
వినిపించి! ప్రాణంబులను గుప్పెటకుదెచ్చు
సింహగర్జనలు సళించబట్టి
రానిచ్చి! కాళ్లడగానని సెలవిచ్చు
ప్రభుతీవి బొత్తిగా వదలబట్టి

గీ. మనము ప్రాణమువలె నైకమత్యముతోడ
గలసితిమి దుర్గతులపాల నిలువబట్టె
మహిమచితికి యీభారతసామ్రాజ్యలక్ష్మి
చచ్చి చావనిబ్రతుకుతో చావవలసె.

నాప్రాణధనులు, నామనోరథసారథులు, నాయభిమానసామ్రాజ్య ధౌరేయులు, నాప్రణయగాన సుధాప్రవాహరాజహంసలు, నా భారతశూరాగ్రేసర వీరాభిమన్యులు, యీనిరంకుశ శ్వేతాశ్వప్రభుత్వకారాగారములలో ఎన్ని పడరానిపాట్లుచే, కృశించుచుండునోగదా!

[మోహిని కోపంతో ప్రవేశం]

మోహి—శుభమా! అంటూ నాతనయులు నిన్న పట్టుబట్టగా ఏమిటో యీపద్ధ్యగోష్ఠిముఖంతో నీవీమాదిరి నడియింటా బడి ఘోష పెట్టటమేమిటి, నీతీరు నాకేమి బాగుండలే.

రాజ్య—(మౌనముతో తలవంచుకొనును)

మోహి—నావంక చూచి మాట్లాడుటకే సిగ్గనిపించుచున్నదిగా.

రాజ్య—(దుఃఖమున) నాకు స్వస్థతగా లేదండి.

మోహి—స్వస్థతగా లేకపోవడానికి తీపరమా, పొద్దస్తమానము మనసు ఎక్కడో ఉంచుకొనే దాపరంగాని, లేవవేమి. అత్తగారన్న గౌరవంగూడా లేనిపాపిష్టిపిల్లవు దొరికావు, ఎట్లాగితేనేమి.

రాజ్య—పాపిష్టిరాలితో, బహుశా బుద్ధిమంతులైన మీకొడుకులకు సంబంధమెందుకు. విడచిపెట్టక.

మోహి—ఎంత గడుసుదానవే చచ్చినా మాటపడవు (కోపముతో) యీతడవ నోరెత్తి సమాధానముచెప్పచూస్తాను. పెద్దంతరము చిన్నంతరము లేక ఈవరస తెగబలిసి కూయరాని కూతలెల్ల

కూస్తావా (భేతాళుడు ప్రవేశము) (పప్పుగొంతుకతో) నేనే నా డుచేసుకొన్న మాయింటి ఆయనచేతనైనా పల్లెత్తుమాటపడి ఎరుగను దీనిపాట్టపగల. దీని నోరెప్పుడు పడుతుందోగానీ.

భేతా—ఏమదితల్లీ !

మోహి—నీవే యిప్పుడు రాసక్షి తే యీబ్రహ్మరాక్షసి చేతిలో చచ్చిపోయేదానినే రా నాతండ్రీ !

భేతా—(కోపావేశముతో) నీ పూర్వపుగర్వ మింకను సాగించదలచితివా (పోయి జుట్టుపట్టుకొని తన్నుచుండ)

[విద్యానిధి, ధర్మరాజు, బలుడు ప్రవేశము]

రాజ్య—(అపార దుఃఖమున లేచివచ్చి విద్యానిధీ ధర్మరాజు బలుల కాళ్ళపై బడుచు) నాప్రాణధనులార రక్షించుడు.

భేతా—తన్ని జుట్టుపట్టుకొని లేవనెత్తి (పసద్రోసి) ఎవడేనన్నడ్డగించేది?

రాజ్య—(పడి) ఆయెయ్యా దైవమా ఆపద్బాంధవా యింత నిర్దయా!

మోహి—(కోపముతో తన్ని) సిగ్గులేక గయ్యాళివై వాళ్లవాళ్లపై పడుచుంటివిగా.

విద్య—మహాపాతకము. నీప్రాణనాధుని ధిక్కరించటం తగునా?

బలు—దోషము, నీప్రాణపతిని ఎదిరించి మాట్లాడుట.

మోహి—అట్లా గడ్డిపెట్టండి నాయనా బుద్ధివచ్చునేమో?

భేతా—ఛీ ! దీనిని పాపమని తలంపకూడదు పదండి పోదాం.

(అందరు నిష్క్రమింతురు)

మోహి—ఛీ ! కన్నెత్తి దీనిమొఖమైనా చూడగూడదు.

(నిష్క్రమింతురు)

రాజ్య—(దుఃఖము) జగద్రక్షకా జనక నిర్విశేషా దయామయా ఆపద్బాంధవా!

చ. పతిని సతివ్రతానిరతిసాకిన సాధ్విని నీరుబడ్డ! భా
రతజనయిత్రి, పుత్రపదరాజము దాల్చిన రాజ్యలక్ష్మిని
క్షితిపై యీగిరాతునకాజిక్కి పరాభవమందునన్న నా
పతులకు పౌరుషంబు కనుపట్టని నిర్ణతికింక చచ్చెదన్.

(పడిపోవును)

తెరపడును.

2వ రంగము

నడిసముద్రపుమధ్య స్థానము

[శూరుడు, రత్నం చినిగిపారసిపోయిన గుడ్డలచే వికారస్వరూపములు పడియుండిరి]

శూరు—తమ్ముడా! మనజన్మ యీనడిసముద్రపుమధ్య గడచిపో వలసినదేనా!

రత్న—సముద్రునికి మనపై దయలేకపోయినప్పు గడువవలసినదే.

శూరు—

ఉ. ముమ్ములగన్న మాభరతమాత పజాబ్దములబట్టి సుప్రభా
వమ్మునకెల్ల సంతసముపట్టగ భారతరాజ్యలక్ష్మితో
నిమ్మహిపై ప్రశస్తిగడియించు కుమారులబట్టి యీపిశా
చమ్ముల నల్పెరాత్రిముల చందముసాగర జాలిలేదురా!

రత్న—ఆగర్భశ్రీమంతుడననియూ నీవుపుల్లానంతో ఎగసివడుతున్నావు.

ఉ. నీకెరటాలచేతులలో నిక్కగనీటుగకొల్కచున్న నీ
రాకొమరుల్ గతుల్ పుడమిరాలిన మాకవిజాలిపుట్టురా?
నీకడభారతీయులకు నీచపుదుర్గతిపట్టెనేమి, ర
త్నాకరసాగరా తుదకుఅంతయు నీకును జాలిలేదు.

శూరు——నీఘోరమైన ఘోషగాని నీగభీరతరమైన స్వభావముగాని, నీ
అనంతమైన విశాలహృదయముచేగాని,

ఉ. దేశముకై సమస్తము విధేయతగా నిలధారపోసి, ఆ
వేశముత్గ్రగనట్టి రణవీరులకెమ్మెయినైన, సాయముల్
లేశముజేసిచూపెనె కనీసము వీసముగూడ ఆ నదు
ద్దేశము నీకిదేడ ? అదదీనదయాబ్ధికిగాక సాగరా.

రత్నం——నీ అనివార్యశౌర్య గాంభీర్యముచేగాని ప్రచండబడబానల
కీలావళియుతంబైన దివ్యతేజస్సుచేగాని నీ అపూర్వబలగర్వ
నిర్వాహణానేక వీరాలాపములచేగాని మాంవంక చూడుము.

మ. ధరణిన్ మూర్ఖులు మత్సహోదరులు స్వర్గాక్షిణ్యా ద్రోష్టః క్రియా
నిరతిన దుర్మతిఖనిన్ కటాకటికవానినిన్బోలి దురోన్మహీ నీ
పరతన్ భారతకామధేనువును నిర్బంధించి హింసించుచుం
డిరి యీలేగల పద్మునింతటిని తంత్రీమమ్ము రక్షించరా.

అన్నా ! ఎంతమొఱపెట్టుకొన్ననూ; ఈసముద్రుఁడు జాలిపడ
కున్నాడు. మనవంటి కష్టజీవులలో, ఒక్క చిక్కనవాళ్ళతో మాట్లాడటం
అతని హోదాకు చిన్నతనం కాఁబోలు.

శూరు——తమ్ముడా ! ఉన్నకొద్దీ, ఈ సముద్రుడు రౌద్రాకృతి దాలు
స్తున్నాడు. ఇప్పు డితనికి ఆదరణంటు యేమో తెలియదు. ఆ
త్రిజగన్మోహనుఁడైన దయాసముద్రుని ప్రార్థించుదాం రమ్ము.

రత్నం——అన్నా ! నాకు ఆకలివేస్తున్నది.

శూరు——(కన్నీరుకారుస్తూ) ఒసదామోద్ధారకా ! మాకీకష్టకాలంలో ఈ
ఆకలిమంటలుకూడా యేమిటి ? తమ్ముడా ! కూలిరత్నమా !
ఆకలివేసినప్పుడల్లా, యిక్కడ తీర్చువారెవరున్నారు? గ్రుక్కెడు
ఈ ఉప్పునీళ్లుత్రాగి చల్లార్చుకోవాలి. వార్ధిరుకాఁబోలు వస్తు

న్నాడు. మనమిక్కడికి రావటంవల్లనే మండిపడ్డాడేమో పోదాంపద.

ఇద్దరూ వెళ్లుచుండగా త్రాచుపాము కాటుతో శూరుడు "అబ్బా" అని పడిపోవును

రత్నం—ఏమిటి అన్నా!

శూరు—అబ్బా! పాము కాటువేసిందిరా.

రత్నం—అదిగో! కోడెత్రాచు, నా అన్నను కాటువేసి పొదలో దూరుతున్నది. అయ్యో! దైవమా! ఈటనక్కలేని అంత మాను దీవులలో. నా అన్నను నా నాగేటిపాటుదారను పాము వాతను పెట్టితివా? అన్నా! హలాయుధా! శూరాగ్రేసరా! ఎక్కడ పాము ముట్టినది? మంత్రం వేతునా? ఈ క్షేత్రసామ్రాజ్యంలో, నా నాగేటిపాటుదారను, నా రైతురాజును, నా శూరాగ్రేసర చక్రవర్తిని అకాలమృత్యుదేవత పొట్టనుపెట్టితివా! దైవమా! ఈ నిరపరాధులపైన, ఇంత నిరుపేదలమీద నీ కింత క్రౌర్యం ఎందుకయ్యా? దయలేదా ఓ పంచభూతములారా! మీకైననూ ఈ దీనులమీద దయపుట్టదా? ఓ అనంతగంభీర సాగరా! ఎంత కసిదీర్చుకొంటివిరా? ఓ పాపిష్టికాలకర్కోటకా! నీ కసిదీరినదా ఓరీ! దరిద్రదేవతాపుత్రకా! సాధుజనహంతకా! నీ కన్నులు చల్లారెనా?

శూరు—అబ్బా! అబ్బా! బ్రతకను తమ్ముడా!

రత్నం—(కౌగలించుకొని) అన్నా రైతురాజా నిన్ను విడిచిపెట్టి నే నుండలేను. బ్రతుకలేను.

శూరు—అయ్యో! తమ్ముడా! కూలిరత్నమా! నీగతి ఎవరు చూస్తారు.

సీ. ధర్మచక్రముఁ ద్రిప్పి దైత్యబాధను బాపు
విద్యానిధుల గన్న వేదవతికి
ధర్మఖడ్గమువట్టి ధరణీతలం బేలు
ధర్మరాజులగన్న ధరణిసతికి
ధర్మలక్ష్మి గడించి ధర్మకర్మల నడ్పు
ధనబలులనుగన్న ఘనమహిళకు
ధర్మసంస్థలనెల్ల తమభుజమ్ము మోయు
కర్షకరాజుల్ల గాంచినట్టి

గీ. భరతమాతకింక విధాతవ్రాతకతన
బలిమి నీకడగొట్టు బిడ్డలు బలియగు
చుండి రీనాడు వగవక గుండెపగిలి
మనదు బావులతీరురా మాతృఋణము.

(పడిపోవును)

రత్నం — (దుఃఖముతో) అన్నా ! రైతురాజా ! నీకూలితమ్ములకింకా దిక్కెవరు ? అన్నా! మనతల్లికి భరతమాతకు నేనేమనిచెప్పేది? శతవృద్ధుఁడైన జనకుని నేనెట్లా చూచేది ? ఓ అండమానుదీవీ ! నన్నుకూడా నీపొట్టబెట్టుకొని ఆకలి చల్లార్చుకో.

ఉ. అన్న! స్వతంత్రరాజ్యసుగుణాంబుధి ? మంజులవాక్ప్రసూనసం
పన్నకళామృతాంజలి కృపానిధి ! భారతవీరశూరభా
స్వన్నృపచంద్రశేఖర ! ప్రచండహాలాయుధ ! భారతావనిన్
పెన్నిధివై శాంతములు పిక్కటిలన్ బడిపోతి వక్కటా.

అన్నా ! నీపసితమ్ముని దిక్కుమాలిన అండమానుదీవికి నొప్ప జెప్పి పోతివా. అన్నా శూరాగ్రేసరా!

[వార్ధరు ప్రవేశము]

వార్ధ—నక్కి నక్కి యీ మూలను ఆ మూలను వచ్చి దాగుతున్నావేమిటి. కంటబడ్డప్పుడు దొంగవేషాలతో ఎక్కి ఎక్కి ఏడ్చ్చి [illegible] పారి పోవటానికి ఎత్తులా ఇది.

రత్న—అయ్యా! మాయన్నను పాము గరిచినది.

వార్ధ—పాములేదు గీములేదు. పిల్ల ఎక్కడ ([illegible]) [illegible] దోవ పట్టినావుగాని పద.

రత్న—అయ్యా! మాయన్నయ్య

వార్ధ—అన్నా చచ్చాడా. సముద్రంలోకి యీ [illegible]స్నానముతో [illegible] కక్కడ ? పద.

రత్న—సముద్రమా! మాకు దిక్కు. అన్నా నేను సుఖసముద్రంలో ఉండలేను (దూకుడుగా పోయి సముద్రంలో దూకి కనిపించ కుండా పోవును)

వార్ధ—అరే! ఏమిటీచిత్రం. వీడు సముద్రంలోకి దుమికాడేమిటి. పీడ వదలిందిలే మాకు. (నిష్క్రమించును)

3 వ రంగము

అరణ్యము.

[భీకర ఘోర క్రూరమృగావళులు ఘోరముగా ఘూర్ణిల్లు చుండును. దీనవదనులై భరతమాతా, జనకుడు సంచరించుచు ప్రవేశించెదరు.]

భరత—ఆవచ్చునదెవరు ?

జన—మనసంస్థానకవులు గాబోలు.

భరత—తిక్కశాస్త్రిగారా ?

జన—అవును మనరాజ్యపతనముతో యీమనకవిసార్వభౌములుకూడ బ్రతుకుదెరువులేక అడవుల పాలైరిగా ? ఔరా! ఎంత పాపిష్టి కాలము దాపరించినది.

[తిక్కనశాస్త్రి ప్రవేశము]

జన, భరత—కవిసార్వభౌమా! నమస్కారములు (నమస్కరింతురు)

తిక్క—పరమేశ్వరా ఈపురాణదంపతులు యీఅష్టైశ్వర్య భోగ పారాయణులకు నేటికెంతదురంతకష్టము బట్టి నట్టడవిలోపడి రయ్యా! (కన్నీరు పెట్టుకొనును)

జన—కవిసార్వభౌమా! చిరంజీవులకుసుఖ కుశలమేగదా భారతీయులు.

తిక్క—ఈనిరంకుశ శ్వేతాశ్వప్రభుత్వంలో కుశలమెక్కడిది. కుమారుల సౌఖ్యమెక్కడిది. అండమానులలో కొలిమిలిక్కృశించుచున్నారు.

భరత—(దుఃఖమున) నాతండ్రులా,

చ. పుడమినివీరపుత్రుల నపూర్వయశోధన గేహమందు పు
ట్టెడుకడుపార ప్రేమగని పలిసిభారతమాతనేను కా
రడవులగూలె యీవగపుటశ్రుకణమ్ములుచిమ్మువృష్టిలో
బడిపై మేఘగర్జనవిపాతవిఘాతములెన్ని సూచనో.

జన—నాభారతవీరపుత్రులారా!

గీ. మేము బంగారుగడ్డపై మిమ్ముబెంచి
మీమృదుకుసుమ ప్రేమాంజలీమణి ప్ర
సూనపోలికలఁపసికూనలవలె
పెరుగుమాపై పిడుగులు గుప్పించదగునె.

కవిసార్వభౌమా! యీవార్ధక్యదశలో కుమారుల బలిమికలిమి గోల్పోయిబ్రతుకుట దుర్ఘటము.

తిక్క—జనకమహారాజా చింతిల్లకుడు వృద్ధదంపతు లిట్లు కన్నీరు బెట్టుటచే సకలక్షమాగుణ సంపన్నురాలగు భూమాతేమిగూడ నడగి సముద్రములో గలసిపోవును. ఆ వినవచ్చు ఆర్తకంఠధ్వని ఎవరిది?

భరత—(దుఃఖమున) నాబిడ్డఁడేమొ.

జన—పిచ్చిదానా నీబిడ్డలందరు నిర్బంధింపఁబడిరి.

తిక్క— అందరుకాదు హాలాయుధుఁడను శూరుఁడు. నిరాయుధుఁడైన కార్మికరత్నము.

జనకు—మిగిలినముగ్గురు.

తిక్క—మిగిలిన విద్యానిధి ధర్మరాజు బలుఁడు విడుదలగాబడి ఆనిరంకుశ భేతాళ నృపాలకులలోఁబడి బానిసలై బ్రతుకుచున్నారు.

భర—నాతండ్రులారా మీకెంత సురవ స్పష్టముగా వింటిరా తిరిగి ఆ ఆర్తారవము నా కడగొట్టుబిడ్డఁడే.

తిక్క—రత్నమేకాబోలు.

జన—మనబిడ్డఁడే.

భర—నాతండ్రీ! (కౌఁగలించుకొనును.)

జన—కుమారా! (కౌఁగలించుకొనును.)

తిక్క—ఆహా పుత్రవాత్సల్యము; అమూల్యము. జననీజనకుల ప్రేమ అపారము. నాయనా రత్నమూ కుశలమూ నీవున్న శూరుడు గూడా వచ్చుచున్నాడా.

రత్నం—అన్నా (దుఃఖమున బడిపోవును)

భరత—నాతండ్రీ శూరుడెక్కడ?

జనకు—దుఃఖపడెదవేమిరా తండ్రీ.

రత్నం—(దుఃఖమున) అన్నను పాము కరచినది.

భరత—(దుఃఖమున) నాతండ్రీ నా నాయనా (పడిపోవును)

జనకు—నాతనయా నాగేటిపోటుదొరా (పడిపోవును)

రత్నం—అన్నా! రైతురాజా (పడిపోవును)

తిక్క—దైవమా అమృతదృష్టిగల నీవు కూడా విషదృష్టి గలవాడవైతివా. అనుపమాన ధర్మపథానువర్తులైన నిరపరాధులైన నా భారతయోధులు నా నాగేటిపోటుబోరలు నీకేమి యెగ్గొనరించిరయ్యా, ఆపదోద్ధారకా!

భరత—(దుఃఖమున)

మ. కొడుకానగు మోములయ్యె కొడుకా గోవర్గనోద్ధారణా
పుడమిన్ భారతమాతఃశీసితము మూపున్ మోచుగా నిత్తగిన్
కడుభారంబయి కూల్చితేమి కొడుకా, నావంశరత్నాకరా
చెడుగా కాలుడ నాహలాయుధుని నాచిన్నయ్యనిన్ జూపవా.

జనకు—(దుఃఖమున)

మ. సతమున్ బిడ్డలమీదచూపున తరించన్ గల్గు యీవృద్ధ దం
పతులీ ఘోరవిషాదవహ్నికిక గర్భచ్ఛేదమ్ము వారిరయు
కుతలంబున్ మనుపన్ దురాగతము లీక్షోణీస్థలిన్ బుట్టె దు
ర్మతులారా ప్రళయాంబుధిన్ మునిగిపోరా మీరు మీరాజ్యముల్.

తిక్క—జనకమహారాజా!

జన—స్వామీ!

తిక్క—ఇప్పుడు మనమెంత విలపించినను ప్రయోజన మేమున్నది? ఇది అరణ్యము ఆలకించువారెవ్వరు? ఆదరించువారెవరు? అరణ్యరోదనమగును.

జనకు—అయ్యో నిజమే భావి కర్తవ్యమేమి

తిక్క—రాజ్యాధికారములోనున్న బిడ్డల పాలిటబడి మన దురవస్థ తీర్చుకొన జూచుటే.

జనకు—అవును మీరు భద్రముగా మాకు మార్గదర్శకులై గొనిపొండు.

(తెరబడును)

## 4 వ రంగము

### నిగమప్రదేశము

[భేతాళుడు విద్యానిధి ప్రవేశము]

భేతా— విద్యానిధీ!

విద్యా— ప్రభూ!

భేతా— నాభాషా ప్రభుత్వ మీవును నమ నేర్పుగా స్థాపించితివి. నాకు నీ భాషాగానములను వినుటకు వేడ్కగ సంగీతము ఆలాపించి చూపా.

విద్యా—చిత్తము చాలాకాలము నుండి సంగీత్కులను [illegible].

భేతా— మతము సంగతి.

విద్యా—ఆదియు నాలుభాగములు చేసివేయుచున్నాను.

భేతా— సరే, ప్రజలకు మా ప్రభుత్వమునందు భక్తి విశ్వాసములు కలుగజేయించుచుండుము.

(భేతాళుడు నిష్క్రమించును)

విద్యా—బలవంతులదే రాజ్యము. ఏనాడనే ఏకఛత్రాధిపత్యముగా భరతఖండ మేలగల్గుచున్నారు. (చూచి) వీరెవరు ప్రేత మొగాలు.

[భరతమాత, జనకుడు, రత్నం, తిక్కశాస్త్రి ప్రవేశము]

విద్యా—ఈవికారస్వరూపములతోనున్న విూరందరెవరు ?

భరత—నాతండ్రీ నేను నీతల్లిని. వారు నీతండ్రి. వాడు నీతమ్ముడు. వారు కవిసార్వభౌములు. మమ్మెరుగ చివోతివా ?

విద్యా—(ఆశ్చర్యముతో అనహ్యాగించుకొనుచు)

ఉ. ఎబ్బెరికంపురూపముల వేమిటి ? సిగ్గునులేక విూర లీ
దబ్బరలాడ నేటికి వృథాధమణా లివినాన్నపాలనక

జెబ్బులిమైనవాడెచట పిల్లికిబుట్టినవాడటంచు పె
ల్లబ్బురరీతి పిల్వబడెనల్పముగా ముదివోగ్గుదంపతుల్.

రత్నం—

మ. పులిగర్భంబున పిల్లికూనలయి భూపుల్ శేముషీదోర్బలుల్
కవికాలార్భటినున్న ఘోరరిపు భూకాంతాళినిన్ గెల్చుచున్
బలగర్వంబున తల్లిదండ్రులను యేడ్పించి చ్చి మైమరుప్పం
కొలువున్దీర్చి కృతఘ్నులై తిరశతఘ్నుల్ సేలుమీ యమ్మలన్.

జనకు—నాయన కొందరపడకు.

విద్యా—ఓరీ అర్భకా ఏల నిరర్థకముగా ప్రేలెదవు.

భరత—నాతండ్రీ వాడు చంటివాడు. నీనాలవతమ్ముడు. నాగేటిపోటు
ధీర శూరుడు.

ఉ. నీనినుమేనికాంతి కడునిగ్గుగదెచ్చిన రైతురాజు భూ
జాని కిరీటరత్నమణిసంపుట సద్ఘృణిజాలతేజుడున్
మానుషవేమరోషబల మానితకీర్తికి చక్రవర్తివి
ద్యానిధి యీకిరాతనృపద్రోహ దురాగ్రహావృత్తి గూలెరా.

విద్యా—మీరెవరో నాకు తెలియదు. నీరోదన నాకేమియు
అర్థము కావటములేదు. మీమొగములు మీరు రాజద్రో
హముజేసిన వారివలె నున్నారు. ఏల యీవంకబొంకులు
చాలించుము. మిమ్మంటియుండిన మాకుకూడా దోషమాపా
దించును.

తిక్క—ఎంత కృతఘ్నతాద్దోషభూయిష్ఠులై తల్లిదండ్రుల నిరాదరించి
పోవుచుండిరి. భరతమాతా ఇటువంటి బిడ్డలగన్న దానవు నీవెట్లు
సుఖించగలవు.

జన—ఈరాజద్రోహము కుమారులదికాదు. మాపూర్వజన్మసంచితము
నకు ఫలము.

రత్నం—తల్లిదండ్రులారా యిదిగో చిన్నన్న ధర్మరాజు వచ్చు చున్నాడు.

తిక్క— ఇతడైనా ఆదరణగలవాడగునా.

భర—నాఫుణ్యము కొలుగండిన బలుడునుగూడా వచ్చుచున్నాడు.

తిక్క—ఇతడు క్రోధాధికారి ధనగర్వంబున నిట్టేసపడునవాడా యీతడు మట్టుకు తల్లిదండ్రులపై విశ్వాసము జూపగలవాడగును.

[ధర్మరాజు బలుడు ప్రవేశించుచుండగా]

రత్న—సీ. రత్నగర్భంబున రాణ్ములుదిగిన
తలిదండ్రులిట్లు పేదలగు టేల
స్వర్ణపాలికలలో బ్రహ్మానివనలచే
పెంచినవారిట్లు వెరచు టేల
గొప్పలోగిళ్లలో ద్రిప్పినవార లీవల
చెట్టుగుట్టలు పట్టు టేల
అమృతాన్నమును కడుపార బెట్టినవారు
తినుటకేలేక రాత్రింబవళ్లు
గీ. ఘోరదారుణాభీల సంక్షోభకారి
జ్వాలవాలమైన క్షుధాగ్ని కీలనడుమ
కములు టేల కటకట మీగుండెకరుగ
దేలవిన రేల మొర భారతీయులార.

తిక్క—ఆ చంటివానివాక్కు నొక్కింత వినియైనపొందు.

ధర్మ—చంటివానివాక్కు నీచంక కెత్తుకొని విను.

బలు—చంటివానివాక్కా మేము వినవలసినది.

భర—నాతండ్రులారా! మేము మీ తల్లిదండ్రులన్న సంగతి మరచితిరా.

జన—నా బిడ్డలారా! మీ చిన్నారితమ్ముడు హాలాయుధుడు రైతు రాజు ఈ భేతాళప్రభుత్వంలో చనిపోయినాడు తమ్ముల దురవస్థ తెలియదా మీకు.

(ధర్మరాజు బలుడు కలిసి)

ధర్మ, బలు—తమ్ములెవరు ఇనుపకమ్ములు రాజద్రోహులకు చావుగాక బ్రతుకు కాయపడునా. పొందుఅడవులలో బడి బ్రతుకుచుండుడు.

(నిష్క్రమింతురు)

తిక్క—భరతమాత సిపీరకుమారుల కడుపుకోతకు పాపిష్టి కిరాతులు (చూచి) అదిగో మధుపానమత్తుడు భైరవుడు దుర్గర్వాతిశ యమున చిందులు త్రొక్కుచు వచ్చుచున్నాడు.

రత్నం—ఈగర్వపోతులు త్రాగుబోతులై అన్నలకు మాకు యెడ బాటు గలుగజేసిన ఖలులయిన నేను సహించను.

(మీదికి బోవును)

భరతి—(పట్టుకొని) నాతండ్రీ తొందరపడకుము.

[భైరవుడు తూలుచు సోలుచు ప్రవేశము]

కీర్తన

రత్నం— (తల్లిచేతులలోనుంచి తప్పించుకొని దూకుడుగా పోవును)

భైర—ఓరీ! అర్భకా! ప్రేలుచున్నావేమి. అహాహాహా నీఅన్నలురా మీరంతా నాకొడుకులోయి. మీకు ప్రభువెవడు-నేనే. తెలుసునా అ హా హా హా నిల్చిచూడు. నేను చూచుచున్నా, చూడు నాదెబ్బ. (తూలిపడుచు) ఈతప్పు కాపాడి చూడు.

రత్న— (భైరవునిచేతిలో కత్తిలాగి పొడిచి చంపును)

జన—నాయనా! ఆగుము.

భరత—పాపము చంపకుతండ్రీ.

తిక్క—నిమపురుగును చంపకుండరాకూడదు. నాతండ్రీ !

రత్న—ఈభేతాళప్రభుత్వం వినాశనానికి ఈమాదిరి జాత్గోపసగ్గ.

తిక్క—యదార్థం.

జన—నాకుమారా ఇది ప్రమాదసమయం. ఇచ్చట నిలువకూడదు.

తిక్క—ఇదియునిజమే. ఎచ్చటికిపోవుదము.

భర—ఎచ్చటకు వెళ్ళినను పట్టుపడక తప్పదు. ఈదాపుననే ఉండుట కొంతమంచిది.

తిక్క—నిజమే. ఇప్పుడెచ్చటికి పరాయికాకూడదు.

రత్న—ఆచెట్టుక్రిందకు పోవుదమురండి. (నిష్క్రమించును)

[మోహిని ప్రవేశము]

మోహి—ఏమిది మాభైరవుడా ఏమిటిజనవదంతి భైరవా, భైరవా, ఎంచతగిన సన్మానములేనిదే ఒంటరిగా పోవద్దని నేనెంత మొత్తుకొనుచున్నను వినకుంటివిగద. ఈ విపత్పర్వతము నీ తలపై ఎన్నడు ఎగిరిపడరాతండ్రీ. నాతండ్రి మీఅన్న భేతాళున కీవార్త ఎపుడు తెలియునురా దగ్గరఎవరునూలేరుగదరా నాయనా గర్భదరిద్రముచే స్వదేశమువిడచి ఇచ్చటికివచ్చి సుఖముగా బ్రతుకుచుంటిమిగదాయని యుప్పొంగుచుంటిమి గదరా. ఇంతలో ఈప్రళయమువచ్చి పడునని కలనైనా తలప లేదుగదరా కొడుకా ఎక్కడపడివుంటివిరా నాతండ్రీ. ఈభరత మాత బ్రహ్మరక్కసియై నిన్ను బలిగొనెనాతండ్రీ.

ఇంత ఘోరదుర్దాంతదుష్టాంతమునుజ
హాంతక కృతాంతపాశిప్రేసంతతులను
కంటివాట నాదుకడుపును గాల్చితివాట
పాతకీ ఘాతకీ ఓసి భరతమాత ?

నీకన్న బిడ్డలపై నీకెంతతీపియో నాబిడ్డలపై నాకంత తీపియని తెలియకున్నదా పాపిష్టిరాల నావరహాలతండ్రిని ఎక్కడ నీపొట్ట పెట్టుకొంటివి దయదాల్చి నిన్ని ప్రాణములతో విడచిపెట్టినందుకు నావిధి బలమా కృతఘ్నురాల!

మ. కొడుకా నాకొడుకా మరెప్పుడిది నాకొంపన్ ప్రవేశించి నా
కడుపీమాదిరి కాల్చగల్గినదిరా కాలానలజ్వాలలన్
పుడమిన్ బ్రద్దలుజేసి ఆనెరియలన్ పూష్పింతునో భారతీ
యుడనిన్నున్ పడద్రోసి నీజనని ఆయుర్దాయముం తీతురా.

కొడుకా నాకడుపుమంట చల్లారునట్లు కొడుకా భైరవా నీవెంట నన్నుకూడ తీసుకొనిపోక పోతివా.

[భేతాళుడు ప్రవేశము]

భేతా.—అదేమితల్లీ దుఃఖించుచుంటివి.

మోహి.—నాతండ్రీ.

గీ. పాపభీతిలేనట్టి యీ భారతీయ
జాతి దారుణకార్యణ వీతివహోత్ర
పు సుడిలోన మారణమయిపోయినాడు
రాకొడుక! నీదు తమ్ముడు బ్రదుకగలమె.

భేతా.—ఓరీ! కృత్రిమాలోచనపారాయణులార! భారతీయులార ఎంతసాహసము చూపించగల్గితిరి ఆత్రిభువనాధిపతులు అడ్డగించినను నా అప్రతిహతమై ప్రచండ ప్రతాపాగ్నిహోత్రపుగుండములో మిమ్ము మారణము చేయనిదే విడతునా నా తమ్ముని నీ పొట్టబెట్టుకొన్నప్పుడు నేను మీ ముప్పదిఆరుకోట్లజనమును నా పొట్టబెట్టుకొననిదే నిద్రింతునా! ఈ భేతాళుని సమానదుర్బలభయంకరానల ప్రభలోరెనని ఉట్టూతలూగుచుండిరిగా

విద్యానిధీ ఇంకను ముగ్గురిప్రాణములు తీతును నా తమ్ముని ఎవరు చంపిరో చెప్పుము.

విద్యా—(భయముస) అయ్యా ! దైవసాక్షిగా మే నేపాపమెరుగము తమరు సెలవిచ్చుచో హంతకుల తెచ్చి సదీ సెపట్టి మీకు నొప్పగింతును.

మోహి—అప్పగింతురా.

ధర్మ—ముమ్మాటికి అప్పగించెదను.

భేతా—ఒప్పగించనిచో.

బలు—మమ్ము వురితీయుడు.

భేతా.. సరె శీఘ్రమే వెతకి ఆ హంతకుల పట్టుకొనిరండు, పొండు.

(విద్యానిధి, ధర్మరాజు, బలుడు నిష్క్రమించును)

భేతా—వగవకు

ఉ. రోసమునచ్చి మోముపయి రోతగ ప్రేతకళల్ జనించి, స

న్యాసులుగా మదీయచరణమ్ములు పట్టిసభారతీయులీ

మోసమునున్న వారిశిరముల్ నొనిమిన్ బలిమిన్ ధరిత్రి నీ

దోసిట తర్పణంబు విడుతున్ నొలివెచ్చని రక్తధారని.

మోహి—అప్పుడుగాని నాకడుపుమంట చల్లారదు.

భేతా—అదిగో వచ్చుచున్నారు యీమూర్ఖులే తమ్ముని జంపినహంతకులై యుండవచ్చును.

[భరతమాత, జనకుడు, రత్నం, టిక్కుశాస్త్రి, విద్యానిధి, ధర్మరాజు, బలుడు ప్రవేశింతురు]

విద్యా—ప్రభూ ! వీరలే తమసోదరులను జంపిన చెడుగులు.

ధర్మ—తమతమ్ముని పొట్టబెట్టుకొనిన ఘాతకులు.

బలు—తమసోదరుల వధియించిన హంతకులు,

భేతా—ఔరా! పాపిష్టినష్టజాతకులారా! నరహంతకులార! ఈప్రచండ ప్రళయకాల పాథోధి బడబాగ్ని జ్వాలభీభత్స్వరూప రౌద్రాకృతి నుంచి తప్పించుకొనిపోగలరా? నిలుడు.

రత్నం—అయ్యా! యేల? ఈనిరర్థకనిష్కారణ శుష్కగర్జన.

భేతా—అవురా! అర్భకా! నిర్భయముగా మాట్లాడుచుంటివి. ద్వీపాంతరవాసమునుంచి యెట్లు వచ్చితి.

రత్న—అది మా సాహసము.

భేతా—ఏదీ సాహసము. ప్రభంజనా దండధరా!

[ప్రభంజనుడు దండధరుడు ప్రవేశము]

భేతా—శీఘ్రమే వీని గొంపోయి చిత్రవధ.

భర—అయ్యా! పసివానిమాటలకు తామసము తగునా!

మోహి—ఓసీ! గయ్యాళిగంపా! నా పసికూనను చంపతగునా. దీనిని కూడ గొనిపోయి వధించుడు.

భేతా—ఆరక్కసినిగూడ గొనిపొండు.

జన—ఆ పతివ్రతారత్నమును జంపిన మీకేమిలాభము.

భేతా—నిన్నుగూడ చంపవుందువా.

తిక్క—అయ్యో! అదికాదు. నిరపరాధులము. కొంచెము విచారించుడు.

భేతా—ప్రభంజనా! వీరినందరిని గొనిపోయి వురితీయుడు.

రత్న—

సీ. కడగండ్లలో మోసికనిపెంచినట్టి మా
తల్లికి కాళ్లబంధాలువేసి
అల్లారుముద్దుగా అఖిలభాగ్యములిచ్చు
తండ్రికి సంకెళ్లు దయదగిల్చి

చేదోడువాదోడుగా నొసఁగఁబూనెద
తమ్ముళ్ల నడిసముద్రమునఁ బెట్టి
చల్లని ఆశీర్వచనమిచ్చి గాచెడి
కవిసార్వభౌముల కాలఁదన్ని
గీ. ఈనిరంకుశభోగాభిమానవిశ్వ
రపరిపాలనాఖండధురంధరత్వ
మునకు బలియిచ్చుటకు మీకుఁబుద్ధిపుట్టె
తీసికొనివచ్చినారా భూవరులార
మిన్నకుండఁదగదేల నా యన్నలారా.

భేతాళనామధేయా సకలసామ్రాజ్యభాగధేయా నాతల్లిదండ్రులు వృద్ధులు. వారు తమ్ముని చంపినవారుకారు. ఈకవిసార్వభౌముడు. అమాయకుడు. బలహీనుడు ఇతడు హంతకుడుగాడు నేనే. నీతమ్ముని జంపినది, హంతకుడ నేనే ? వారిని వదలి నన్ను గిత్తియుము. మీభేతాళ సామ్రాజ్యము వర్ధిల్లజేసుకొనుడు.

భర——నాతండ్రీ నాకు దిక్కెవ్వరు.

జన——నాకుమారా నావంక జూచువారెవరు.

తిక్క——నాపుత్రరత్నమా మామొర వినువారెవరు.

భేతా——ప్రభంజనా దండధరా! యీహంతకుని బంధించి వారందరిని వదలిపెట్టుడు రేపు ఈహంతకుని చిత్రవధజేయుటకు తగిన సన్నాహములు భద్రపరుచుడు. (నిష్క్రమించుచున్నాడు)

ప్రభం——(రత్నమునకు సంకెళ్లువేసి మిగతా వారిని వదలివేసి) పొండయ్యా మీరు. ఆలస్యముజేయకుడు.

దండ——మరల మీకు పట్టిన యురి, మాకు పట్టునేమో పదండి పదండి త్వరగా.

భర——(దుఃఖమున) నా తండ్రీ (కౌగలించుకొనును)

జన—(దుఃఖమున) నా బంగారుతండ్రీ (కౌగలించుకొనును)
రత్నం—తల్లీ భరతమాతా. జాతస్యమరణం ధ్రువం పుట్టినవాడు చావకమానడు. పుట్టి తల్లిదండ్రుల సేవజేసి చచ్చినవాడు ధన్యుడు మీ పూజనీయమైన మీపాదరవిందముల సేవజేయుటకు భగవంతుడు నాకు ఆయుర్దాయమిచ్చిన కృతార్థుడనయ్యేడివాడను. జనకా చింతింపకము. అయ్యా మీ యోపికకాలము. ఇట్టి చింతలను వ్యర్థముజేయుక ప్రపంచశాంతిక పరిణ్యాసీమలో తపస్సుజేయుడు. కవిసార్వభౌమా ఇంత నిచ్చివాడవేమయ్యా. సమస్తము తెలిసిన మీ వంటి కవిపుంగవు లిట్లు దుఃఖించుట తగునా కరుణారసమ్ము జిమ్మి వీరరసమును బుట్టించు నాటకములు నవలలు రచించి చరితార్థులుకండు మీ వంటి కవిచక్రవర్తులవలననే ఏనాటికైనా ప్రపంచశాంతి చేకూరును. చింతిల్లకుము, జననీజనకులారా మా కష్టగొట్టు బిడ్డనందించు యీ కడసారి కృతజ్ఞతాపూర్వకమైన అభివందనములు గైకొనుడు. ధైర్యము విడనాడకుడు.
(భరత, జనక, తిక్కశాస్త్రి) కొడుకా నా వరహాలతండ్రీ!
ప్రభం—ఓహో! బాగానే వుంది యీ వ్యవహారము.
రత్నం—జననీజనకులారా! చింతిల్లకుడు.

(భరత, జనక, తిక్కశాస్త్రి నిష్క్రమింతురు)

## 5 వ రంగము

[దండ, ప్రభంజనుడు ఖడ్గపాణులై రత్నమున కిరుప్రక్కల నిలువబడుదురు]

రత్నం—ఈశ్వరా జగదీశ్వరా అవ్యాజ కరుణాకటాక్షము. ఈభౌతిక దేహామందు నన్ను పడలేని అమూల్యమైన వివిధాలంకారము

లతో శోభిల్లజేయుచుండిన యీ విశ్వనికేతనమునకు పంపి నా వలన సమిజేయుచుంటివి దుర్మార్గా నీ సామ్రాజ్యపాపాగ్నులలో నేల కొల్పబడిన సమస్త ధర్మస్వర్ణ సౌధములను దిరుగాడి అమృతాహ్నముల ననుభవించి మైమరచి యుంటినేగాని సార్థకము సంపూర్ణముగా సంకల్పశుద్ధిగా మాతృదేశారాధనము నేయక పోతినిగదా.

[రాజ్యలక్ష్మి ప్రవేశించుచూ]

కీర్తన

ఎంతటి కఠినత జూపె సామ్రాజ్యమదకట
కూలివారిపైన జాలిలేకుండిన
కలుషుడు యీ నృపదైత్యుడు ||ఎంత||
కూలిరాజసార్వభౌముడఖిల
రాజశిరోభూషణుడౌట
నేటికిని తెల్వని భేతాళుండవసి స్థలీ ||ఎంత||
ఎన్నికష్టములనురాని ఎవ్వరడ్డుపడినగాని
సాహసమున కూలిదొరను గావనిటకె నిసురింతును ||ఎంత||

ప్రభంజనుడు—దండధరా ఆ దెయ్య మొచ్చుటది.

దండ—దయ్యమొచ్చుటరా (రాజ్యలక్ష్మి వికారరూపిణియై ప్రవేశము)

రాజ్య—దయ్యమే! నేను దయ్యమై మిమ్ముబట్టటానికి వచ్చాను. విశ్వాసఘాతకులారా! మీరీగడ్డపై నుండి కదలిపోయే అంతవరకు నేను దయ్యమైపట్టి మీకుపూపిరాడనిత్తునా.

దండ—అరే! దొరసానిగారురా.

ప్రభం—అమ్మా క్షమింపుడు. నాకిది ప్రభువువారిచ్చిన ఆజ్ఞ.

రాజ్య—ఇదిరాణీగారిఆజ్ఞ వదలిపొండు. లేదా మీకు పుట్టగతులుండవు.

ప్రభం—వెనుకకు పోయినను గోయ్యి ముందుకు పోయిన నుయ్యి అన్న
సామెతగా వున్నది మనఖర్మము.

దండ—వీరికికాదురా వురి మనయిద్దరి మెడకు జుట్టుకున్నది.

రత్నం—దేవీ రాజ్యలక్ష్మీ నీకే వికృతాకారమేమి.

రాజ్య—

గీ. చతురుదధి పరివేష్టిత చాతునీవ
సుంధరాచక్రమును భుజస్కంధముపై
మోయుకూలి తండ్రికి నేటికాయులెల్ల
దీరు చిత్రవధకు మాస్పుమారిపోయె.

రత్నం—దేవీ చింతించక.

గీ. పడతి యీఘోరమారణపాలనా! ని
రంకుశ నృపాలభేతాళ రాజ్యనాశ
సమయ్యమున కేల్పు నా సుతుల సమ్మెలంద
రింక బలికావలయునో సహించగలవే.

రాక్ష—అదిగో భేతాళుడు వస్తూన్నాడు.

గీ. యీనిరంకుశభేతాళుడే గదా! మ
దీయవజ్రహలాయుధుదక్క మొక్క
లేనివానిగాజేసినా నాప్రాణధనుడ
నైన కూలిదొరా నిన్న మాంతమిపుడు
మ్రింగ చనుదెంచుచుండె తిమింగలముగ
అక్కటా ఆడదాన నేనడ్డగలనే.

రత్నం—నాభరతరాజ్యలక్ష్మీ? అపారవిద్యాసముద్రులైన అన్నలు
మాసముద్రాలంకారులై అఖండ బలపరాక్రమసింహాలయిన

అన్నలు వంటి పిరికిపందవైతే కురుసార్వభౌమువంటి ధనస్సుతోనైన అన్నలు చాతగాని సలిమిడిసుద్దవైతే ముసుగువేసుకొని మూల బడి బాసినవైనప్పుడు.

గీ. ఆడుదానవై అబలవై అఖిలభార
తావనీ కోమలారామ జీవమ్మునన
రోవరమ్మృణాళనాళమ్ము నీవ టం క
టా ! నిరంకుశగజముల అడ్డుగొనుట ?

ప్రభం—దండధరా ప్రభువురా.

దండ—ప్రభంజనా ఆదొరసానిగారిని పొమ్మనరా.

ప్రభం—అమ్మా దొరసానిగారు దొరగారొస్తున్నారు. మాకు మాట వస్తుంది మీరుపొండి.

(రత్నమున కిరుప్రక్కల ఖడ్గపాణులై నిలుచుందురు)

రాజ్య— నానాగేటిపాటి దొరను. నాకడగొట్టు కూలిదొరను. మీవాటొరల పొట్టనుబెట్టి నేనెచ్చటికి పోగలను ? యింకా యీ భగిత రాజ్యలక్ష్మి మీకు మీదొరగలను [illegible] అన్న ఆశో రాల్ని ముట్టనీయక కంటికి నిద్రపట్టనీయక రూపుమాపినదే వదలిపోవునుగా ?

[విద్యానిధి, ధర్మరాజు, బలుడు, మోహిని భేతాళుడు ప్రవేశింతురు]

భేతా—(కోపోద్రేకంతో)

శా. పారావారపరీత భూవలయ శుంభద్గ్రావ దంభోళియై
వీరానేకపసింహమై చెలగు ఈ భేతాళునిన్ నేడు, ధి
క్కారం బెవ్వడు సేయునో యతని మత్ఖడ్గంబుచే గూల్చి, భూ
భారంబే నుడిగింతువాడు పసిపాపండైన నూకొందునే.

రాజ్య—(యెదురుగా బోయి) ప్రభూ ! పతిభిక్ష పెట్టి యీ దీనురాలి కాపాడుము.

భేతా—పతిభిక్ష గాదు నీకు దుర్గతిభిక్ష బెట్టెదను. దండధరా దాని నావల కీడ్చుకొనిపొమ్ము.

దండ—పదవమ్మా సారసాని (రాజ్యలక్ష్మిని గొనిపోవు చున్నప్పుడు)

రాజ్య—(రత్నమునకు నమస్కరించి) నాధా ! నాకూలిదొరా నీదాసురాలికి సెలవిమ్ము.

రత్నం—సౌభాగ్యవతీ ! దుఃఖింపకుము నాభరతమాతను, నాజనక రాజసార్వభౌముని మరచి యుండకుము పొమ్ము. కష్టసుఖములు శాశ్వతములు గావు.

భేతా—దండధరా ఏమది తీసుకొనిపొమ్ము.

దండ—పదవమ్మా (రాజ్యలక్ష్మిగొని నిష్క్రమించుచు)

భేతా—విద్యానిధీ వధగావింతమా.

విద్యా—చిత్తము.

భేతా—ధర్మరాజా ఇటువంటి రాజద్రోహుల దయదాల్చవచ్చునా.

ధర్మ—ముమ్మాటికి దయదాల్చరాదు.

భేతా—బలా వీనిని పాపమనవచ్చునా.

బలు—పాప మేమిటి ఇటువంటి రాజద్రోహులను పాపమనుట మహా పాతకము.

భేతా—తల్లీ, భేతాళసామ్రాజ్య కల్పవల్లీ ఇదిగో నా తమ్ముని పొట్ట బెట్టుకొన్న యీ దుష్టుని ఖండించి నీ కడుపు సల్లార్చెదను (ఖడ్గమెత్తును)

మోహి—నా తండ్రీ నా కడుపుమంట చల్లారును.

ముదుతలువడు నొక్క తపముచుఁగలవారి
బొక్కసములనెల్ల పూడ్చువాఁడు
తాతిఅప్పను మ్రింగి నిల్చుకొని డే
గలకంట గువ్వగాఁ బడినవాఁడు
గైతు రాజాగ్రణి రతనాలకోటలో
కోడిపుంజుగతిర్గు కూలిబిడ్డ

గీ. డకటకట ! బలియూరాను నే అసురభీక
రమ్ముగ భేతాళసాతాళ రాజ్యమందు
కూలిపాపఁడు బలియైన గూడనింక
బ్రదికియుంటిమి జీవచ్ఛవాలవోలె.

జనకు—దేవీ ! (దుఃఖమున) ఈరుధిరప్రవాహ మెచ్చటిది ?

భరత— నాథా ! నాకూలిరత్నమును ఈకిరాతకులు వంచించిరా ఆశిర స్సెవరిది. (దగ్గరకు పోయి చూచి) నాతనయుడే, నాకూలి రత్నమా! నాచిన్నయా! నాసగుమోములయ్యా. (పడిపోవును)

జన—ఎంతఘోరము! ఎంత పరంతపాపభూయిష్టులు! వృద్ధులకన్నీరు లోకమునకు క్షేమమా ! క్షామముగాని (దుఃఖమున) నాకూలి తండ్రీ ! నాకార్మికరత్నమా ! నిన్ను చంపుకొని జీవచ్ఛవములై యున్న యీతలిదండ్రు లెంతపాపులోగదా ! నాకూలిదొరా! నీవుకూడ నాగేటిపోటుదగ్గరకు పోతివా ! నాతండ్రీ !

[తిక్కశాస్త్రి మహాజనముతో ప్రవేశము]

తిక్క—

కీర్తన

భేతాళ సామ్రాజ్య విధ్వంసమునకు
బాలభారత వీరకూరాభిమన్యుల్

క్రొత్తయింటిలో బుట్టి వర్ధిల్లవలయు
భేతాళసామ్రాజ్య విధ్వంసమునను.

ఈ నెత్తుటికాలువ నా కూలిరత్నంలోనుంచి ప్రవహించినదా యేమి? (చూచి దుఃఖమున) నా కూలిరత్నము [illegible] నక్షత్రనాయకుండు [illegible] నిరంకుశభోగలాలసుల సుఖజీవనాధార తిరుమూలములను దప్పికదీర్చు చున్నావు, నా నాగేటిపోటుద్వార నాకూలిరత్నము యీ నిరంకుశ భేతాళప్రభుత్వంలో సుళ్లియు బల్లియున సంగతి నేటికైనను తెలియు చున్నదా, సోదరులారా! భారతదేశపుత్రులారా! యిది ప్రశాంత సమయముకాదు. ఇదిగో [illegible] మన [illegible] తెమ్ముల్లైన కూలి రత్నం తునియాతునియలుగా [illegible] దేశమాత కంటికి మింటికి నేకధారగా నశ్రువులగా [illegible]చున్నది. మన [illegible] పుత్రులను మనకు యిచ్చుదశ ఆమె కటాక్షవీక్షణములచేతనే ఆమె దుఃఖోప శమనము మన విధి ఆమె అశ్రుధారల నరికట్టుటకు మనము రక్తధారల కార్చుటకైనను వెనుదీయకూడదు. కలకాలము బానిసల్మై జీవచ్ఛవం బుల మాదిరి యీ భేతాళప్రభుత్వపాదరక్షల ప్రహారములను తినిలపడి యుండుటకంటె చచ్చి వీరస్వర్గమనుభవించుట మేలు, జీవించితిమా స్వతంత్ర జీవనము ప్రమంధితిమా వీరస్వర్గము కవిసార్వభౌములారా, పండిత వేదండములార, మీను అద్వితీయ ప్రతిభా సంపత్తులను యీ సమయ ములో పుష్పమకరందము నాస్వాదించు సోమరితుమ్మెదలమీదనే వృథా చేయకుడు. ఈసమయము భద్రాజాకవిత్వమునకును, సమయముకాదు. దేశమందంతటను ఈకవిత్వములే తాండవించుచున్నవి. దేశబానిసత్వ మును పటాపంచలుచేయగల వ్రాతలే వ్రాతలు, దేశబానిసత్వమునకై పాడబడు గేయములే గేయములు, దేశబానిసత్వ విధ్వంసమునకై ఆడ బడు సినిమాలే సినిమాలు, దేశబానిసత్వ విచ్ఛేదనమునకై నటించే నటులే

నటరాజులు, మనదేశ బానిసత్వకళంకమును తుడిచివేయగల వీరులే వీరులు. దేశబానిసత్వమును నిర్మూలింపగల విద్యలే విద్యలు. వీర రస ప్రధానరచనలకే యిది సమయము. ఓ అభావకవులారా! యీకూలి రాజును పుణ్యారక్తస్రవంతిలో స్నానముచేయించు.

కీర్తన

తల్లులందరు సిగ్గుగంధములు దీసి
సిగపూజలు చేసి స్పృహ తప్పియున్న
భరతమాతను లేపి ధైర్యంబు గొల్పి
జయభేరితో జగతి కన్పించునట్లు.

(తెరపడును)

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## స వ ర ణ ప ట్టి క.

| పుట. | పంక్తి. | తప్పు. | సవరణ. |
|---|---|---|---|
| 4 | 12 | శృంగార | సుస్నిగ్ధ |
| 16 | 4 | తేదండి | లేరండి |
| 17 | 16 | మీ రేమి | మీ పేరేమి |
| 26 | 5 | తనయులెల్ల | తనయులుండ |
| 29 | 7 | దుస్వప్నాలు | దుస్వప్నాలురోజూ |
| 33 | 23 | హాళక్క | హుళక్క |
| 37 | 12 | | భేతా :— |
| ,, | ,, | మువ్నె | ముస్నె |
| 40 | 4 | పట్టుబడులు | పెట్టుబడులు |
| ,, | 7 | రైతులును | రైతులు |
| ,, | 10 | ఏలివారి | ఏలినవారి |
| 48 | 7 | పొగతీయ | పొగరుతీయ |
| 50 | 19 | దెచ్చునుగా | దెచ్చెనుగా |
| 56 | 11 | భరతవర్షము | భరతపర్షమునెల్ల |
| 60 | 2 | సంస్థాపించూటే | సంస్థాపించుటే |
| ,, | 5 | తెట్టించు | పెట్టించు |
| 61 | 2 | శ్రీవంత | శ్రీమంత |
| ,, | 25 | ఛీరు | ధీరు |
| 64 | 13 | మా | మీ |
| 68 | 9 | పిచ్చిదాని | పిచ్చివాని |
| 70 | 14 | వచ్చినా | వచ్చి |
| 72 | 16 | పుట్టలేదు | పుట్టుటలేదు |
| ,, | 19 | చుండిన | చుండిన |
| 83 | 8 | కొమిలి | కుమిలి |
| 87 | 7 | రళతమ్ముల్ | రకృతమ్ముల్ |
| ,, | 8 | నాయన | నాయనా |
| ,, | 10 | నాలవ | నాల్గవ |
| 97 | 8 | కాయులెల్ల | కాయువెల్ల |
| 98 | 1 | వంటి | వట్టి |
| 102 | 18 | మేము | మీరుమా |